విశాలాంధ్రలో

మార్చి 14న విడుదల




నిర్మాతలు:

అరుణా ఫిలిమ్స్, మద్రాసు-17.

# మార్చిలో విడుదల!



కృష్ణా పిక్చర్స్ వారి

# అమ్మలక్కలు

డైరెక్టర్: యోగానందం సూపర్విజన్: ప్రసాద్ కథ: సదాశివబ్రహ్మం

ఎన్. టి. రామారావు, పద్మిని, అమర్‌నాథ్, రేలంగి, డా॥ శివరామ
కృష్ణయ్య, లలిత, సురభి బాలసరస్వతి, ఋష్యేంద్రమణి, సూర్యకాంతం
నటించిన అద్భుత సాంఘిక చిత్రము.

GH RAO

... చమ్రియా రిలీజు ...

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
సంపాదించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౨౨]     మార్చి 1953     [సంచిక 3



# విషయసూచిక
















కంకణ గృహీత ఊ. లక్ష్మీకాంతమ్మగారు, ఆమె భర్త హయగ్రీవగుప్తగారు, జా. సీతామహాలక్ష్మిగారు



కుటుంబ సమేతంగా శ్రీ కేసరిగారు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారికి
స్వర్ణకంకణము తొడుగు సందర్భమున తీసిన ఛాయా చిత్రము.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# గృహలక్ష్మి జయంతి

## శ్రీ సి. సి. పున్నయ్యగారి స్వాగతోపన్యాసము.



పూజ్యులారా, సోదర సోదరీమణులారా!

ఈమహోత్సవ సందర్భమున మా ఆహ్వానాన్ని అందుకొని వచ్చి పాల్గొంటున్న మా గృహలక్ష్మి పత్రికా పాఠకులకు, కవులకు, కవయిత్రులకు, రచయితలకు, రచయిత్రులకు హృదయపూర్వకంగా స్వాగత మిస్తున్నాము.

క్రిందటి సంవత్సరము యిదేవేదికమీద పూజ్యులు కేసరిగారి ఆరోగ్యము అభివృద్ధిదశలో నున్నందుకు సంతోషాన్ని ప్రకటించాము. కాని యీనాడు అదేవేదికమీద వారి ఆరోగ్యము తృప్తికరముగా లేకపోవడం వలన యీయుత్సవాన్ని ఉత్సాహావంతంగా జరుప కలుగుచుండుటలేదు. భగవంతుడు వారికి ఆయురారోగ్యాలు ప్రసాదించవలసినదిగా ప్రార్థించుచున్నాము.

ఇట్టి సమయంలో మా 'గృహలక్ష్మి' పత్రికయొక్క ముందు వెనుక చరిత్రను ముచ్చటించడం ఆచారం; ఈపత్రిక 25 సం॥ల నాడు స్థాపించబడి యుద్ధకాలంలో నాలుగు సంవత్సరములు తప్ప యింతకాలమునుండి మహిళా పురోభివృద్ధిని, అభ్యుదయాన్ని లక్ష్యంగానుంచుకొని నిర్వహించబడుతున్నది. 25 సం॥ల నాడు విద్యాగంధము లేక అజ్ఞానులుగా, అమాయకులుగా క్రుంగిపోతున్న నారీమణులను చూచి జాలితో వారిని ఉద్ధరించి అన్నిరంగాల్లో వారిని ప్రోత్సహ పరచడానికని, వారి పురోభివృద్ధికి కృషి చేయడానికి శ్రీ కేసరిగారు కంకణం కట్టుకున్నారు. 25 సంవత్సరముల నాటి మహిళల స్థితిని ఈనాటి దానితో పోల్చిచూస్తే మహిళాపురోభివృద్ధి నలుముఖాల కనుపిస్తున్నది. దీనితోటి శ్రీ కేసరిగారు తమ ఆశయ, లక్ష్యాలు సిద్ధించడం స్వయంగా తాము చూచి ఆనందించడం మహాభాగ్యమనే చెప్పాలి. కాని మహిళా పురోభివృద్ధికి గాను యింకాజరుగవలసిన కృషియున్నది. కాబట్టి గృహలక్ష్మి లాంటి పత్రికల యొక్కయు, శ్రీ కేసరిగారి వంటిదాతలు, ఉదారులయొక్క అవశ్యకత ఎంతైన కలదు.

ఇక యీనాటి స్వర్ణకంకణము బడయనున్న శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని గురించి ఆమెకు సరిసమానమయిన విదుషీమణి చెప్పడం బాగుంటుంది. అయినా ఆమె ఉభయ భాషా ప్రవీణ. విదుషీమణియే కాక చక్కని వాగ్ధోరణి గలది. సంఘసేవాభిలాషి, ఆదర్శనీయమైన గృహిణి. ఈమె రచించిన 'ఆంధ్రకవయిత్రులు' అను గ్రంథము ఉత్తమ మయినదిగా గుర్తించబడి శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని తెలుగుభాషా సమితి వారు సన్మానించారు. ఆగ్రంథము చాల పరిశోధనాపూర్వకంగా రచింపబడటమే కాకుండా తెలుగు సాహితరంగంలో యీనాటికే కాక తర తరాలకు ఉపయుక్తంగా నుండేటట్టు రచింపబడింది.

అనారోగ్య కారణంవలన శ్రీమతి కనకదుర్గాదేవిగారు యీనాటి మహోత్సవ సందర్భమున అధ్యక్షతవహించ జాలకపోవుటచే యీనాడు శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించనున్నారు. వీరు పట్టభద్రులు, న్యాయవాది. రాజకీయ, సాంఘికరంగంలో యీమె నిర్వహిస్తున్న ప్రముఖపాత్ర ప్రశంసనీయము. ఈమెను అధ్యక్షతవహించి జయప్రదంగా కార్యక్రమం జరుపవలసినదిగా కోరుచున్నాము.

### గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత

# శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి

## ఉపన్యాసము

---

ఆర్య శ్రీ కేసరి మహాశయా,

సోదరసోదరీమణులారా, అగ్రాసనాధిపా,

నమస్కారములు. ఈ నాడు శ్రీ కేసరిగారు నాయెడల కనబఱచిన అత్యధిక వాత్సల్యాదరములకు నా మనస్సు ఆనందంతోనూ, కృతజ్ఞతతోనూ నిండిపోయి ఏంమాట్లాడాలన్నా మాటలే రావడములేదు. శ్రీ కేసరిగారు చేసినసేవ–ముఖ్యంగా మహిళాజనసేవ అంతగొప్పది. ఈ వేళ నేను ఏకారణంపై ఇక్కడకు అహ్వానింపబడి వారిచేసమ్మానం పొందడానికి తగు అర్హతను పొందియున్నానో, ఆ 'ఆంధ్రకవయిత్రీచరిత్ర' అనే గ్రంథరచన ఉన్నదే-అది ముఖ్యంగా ఇట్టివారి హితచింతనులైన మహానుభావుల లికల్మష సేవాను రక్తిమీదే ఆధారపడియున్నది.

మనదేశం అన్నివిధాలా చాలా గొప్పదేశంగా ప్రఖ్యాతి పొందియున్నది. ఇప్పటికీ ఆఖ్యాతి దానికేమీ తఱుగలేదు. ఏదైనా ఒకదేశం తక్కిన దేశాలకు ఆదర్శప్రాయంగా ఉండదగినంత గొప్పదనం పొందిందంటే అది ఆదేశంయొక్క భాషపైనా, మతంపైనా, వాఙ్మయంపైనా, సంస్కృతిపైనా ఆధారపడిఉంటుంది. నాటికీ నేటికి మన పవిత్ర భరతఖండం ప్రశస్తి అవిచ్ఛిన్నంగానే ఉన్నది అంటే ప్రప్రథమంలో భాగతఖండ ప్రతిష్టాపకులు, ఏతత్సంస్కృతీ నిర్మాతలైన మహాఋషులయొక్క బుద్ధిపాటవము, దేశహిత నిర్మాణరచనా చింతన మందలి అతి దూరాలోచన, దూరదృష్టి-సమ్యగ్భావన కారణం అని చెప్పాలి. ఎప్పటికైనా మహానుభావులకు ఒకటేచింత 'నాబాగుకంటె నాదేశం బాగుకోసం నేను పాటుపడడం నావిధ్యుక్త ధర్మం'; అనేదే. ఇట్టి ఉత్కృష్ట భావనతో మహానుభావులు పాటుపడ్డారు కాబట్టే తరతరాలు, యుగయుగాలూ దొరలిపోయినా ఇంకా దేశప్రఖ్యాతి సుప్రతిష్టితంగా ఉన్నది. అట్టిమహానుభావులలో శ్రీ కేసరిగారొకరంటే అతిశయోక్తి ఏమీలేదు.

ఇంకా కేసరిగారి విశేషం ఒకటి ఉన్నది. ఈదేశహిత ప్రణాళికలో కర్తవ్యాన్ని నిర్వహించిన వారిలో స్త్రీపుం వివక్షతలేదు. ముఖ్యంగా దేశసౌభాగ్యాన్ని సమగ్రంగా శోభామయంగా రూపులు దిద్దడానికి ముఖ్యప్రాణమైన వాఙ్మయాభివృద్ధి విషయంలో సంగీత, సారస్వతాది ఉత్కృష్టాత్మమయమైన కళాభివృద్ధి విషయంలో ఈ స్త్రీపుం వివక్షత ఎంతమాత్రమూ పాటింపదగనిదీ, సహింపదగినదీకాదు. సృష్టిలోసర్వశక్తులూ సర్వప్రజ్ఞలూ, సర్వార్హతలూ స్త్రీపుం జాతులకు సర్వసమానంగానే ప్రదత్తం చేయబడి ఉన్నాయి. దేశానికి

## శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి ఉపన్యాసము

గృహలక్ష్మి

అక్కడా అక్కడా చెదురు వాటుగా ఉన్న మహిళా వాఙ్మయాన్ని సేకరించి, సముద్ధరించి గృహలక్ష్మిలో అసూచానంగా ప్రచురింపజేశారు. ఈ విషయాలు ఇదివరకే నేను గృహలక్ష్మిలో విపులంగా వ్రాసి ఉన్నాను. అట్లావారు చేయబట్టే నాఆంధ్రకవయిత్రులరచన సులువుగా పూర్తిఅయింది; నిజంగా అన్ని పత్రికల కంటే ఈ పత్రికే నాకు పెన్నిధిలాగ ఉపయోగపడింది.

ఇంత వీరిశ్రద్ధకు కారణమేమిటా అని ఆలోచిస్తే "ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకం" అన్న నానుడితప్ప నాకు వేరే కారణం కనబడటంలేదు.

స్త్రీ జాత్యుద్ధరణ దీక్షాకంకణాన్ని తాము ధరించి యింతపని చేస్తూన్న శ్రీ కేసరిగారికీ విషయంలో నేనే ఋణపడి ఉన్నాను. నేనేకాదు యావత్తు స్త్రీజాతీ ఋణపడే ఉన్నది. ఇది ఎప్పటికీ వారికి తీర్చబడే ఋణంమట్టుకుకాదు. ఆవిషయం వారికీ తెలుసు! ఐనా ఇంకా వారు స్వయంగాచేసిన సేవ చాలకో అన్నట్లు ఈవిధంగా కంకణాలు కూడాఇచ్చి స్త్రీలను ప్రోత్సహిస్తూ ఉన్నారు.

అంటే స్త్రీజాతి ఉద్ధరణ నా ఒక్కనివల్లా నెఱవేరేదికాదు. మీరు స్వయంగా స్త్రీలైన మీరంతా మీజాతి అభ్యుదయం కోసం పాటుపడ్డానికి కంకణం గ్రహించండి, అని హెచ్చరించడం అన్నమాట.

అథమం కంకణం తీసుకొన్న స్త్రీలైనా అట్లావారి నాదర్శంగా తీసికొని స్వార్థరహితసేవ చెయ్యడానికి పూనుకొంటే వారికి సంతృప్తికలిగినట్లే ఎంచవచ్చును. అంతేకాదు. కొంతకు కొంతగా వారి ఋణాన్ని తీర్చడానికి ప్రయత్నం చేసినట్లుగా కూడా వారు తుష్టిపొందుతారు.

అట్లాచెయ్యడానికి సర్వవిధాలా నాకు ఈ మహనీయుల ఆశీర్వాదం తోడ్పడుతుందని ఆశిస్తూ ఉన్నాను.

ఇంక ఆంధ్రకవయిత్రుల చరిత్రరచనలో నేపడ్డపాట్లు ఇదివరకే చాలా వేదికలమీదనుండి నేను పలుమార్లుచెప్పి ఉన్నాను. పుస్తకం రాబోతూ ఉన్నది "ముంజేతికంకణానికి అద్దం ఎందుకు?" మీరే నిర్ణయించుకొందురుగాని; దానివిషయం.

ఇంక ఆఖరుమాట శ్రీ కేసరిగారి ఆరోగ్యవిషయం:—వారి అరోగ్యం అందఱకూ కలత కలిగిస్తూనే ఉన్నది. అంత అనారోగ్యంలో ఉన్నా స్వయంగావచ్చి వారి అమృతహస్తంతో నాకు కంకణ బహుమానం చెయ్యాలని వారి ఉదారహృదయం అభిలషించింది అంటే అది నా భాగ్యం అని చెప్పాలి. దేశసేవారతులైన ఈ మహనీయులకు పరమేశ్వరుడితోఁధిక ఆయురారోగ్యాలు కల్గించాలని భక్తిపూర్వకంగా అంజలి బంధం చేస్తూ ఉన్నాను.

నేటి ఈ శుభసమయంలో నన్ను మిక్కిలీ హెచ్చుగా సంభావిస్తూ ఉన్నసాటి కవయిత్రీకులానికీ ఉపన్యాసకులకూ, ముఖ్యంగా శ్రీ కేసరిగారికీ వారి అనుష్ఠానవర్గానికీ కృతజ్ఞతా వందనాలర్పిస్తూ విరమిస్తాను.

# కవయిత్రులు, కవికుమారులు అంపిన పద్యరత్నములు

## గృహలక్ష్మీ వికాసము

శ్రీరించోళులు చాందినీ లెద తివా చీగాగిరాందే విధీ
శ్రీరమ్యంబుల భావసౌధముల నర్థిన్ గోష్ఠి గావించుశృం
గారాకారముగద్య పద్యములనె క్కాలంబు జూపించు నీ
స్మేరాంకూరము వాఙ్మయమ్ము గృహలక్ష్మీ! నిత్యకల్యాణమై ॥

సారారోగ్య విచారణక్రమ మటుల్, సంగీత సాహిత్యగో
ష్ఠీరస్యత్వరి శుద్ధభావములు, గంటిందన్ను శిల్పంబులున్
ధీరోదాత్త చరిత్రపూత కవయిత్రీ శేముషీ లేఖినీ
శ్రీ రేఖాశయముల్, రచించు, గృహలక్ష్మీ! నీ సువర్ణావళుల్!

అక్షీణ ప్రతిభావిశేషములు ప్రత్యక్షంబు గావించుచున్
దీక్షాకంకణమూని సర్వసుకలాధిష్ఠానమై యొప్పుచున్
వీక్షామాత్రమునన్ రచింతు, గృహలక్ష్మీ! లక్ష్మివై యంతటన్.

సారాచారులు మెచ్చు జూపఁగనునిచ్చల్ సారసారస్వతా
సారమ్మున్ హృది తాపమార్చుటకు విస్తారప్రసారమ్ముగా
ధారాళంబగు శైలినల్లడలఁ జంద్ర జ్యోతిరున్మేషగో
క్షీరాపూరసు కీర్తిఁగొంటి గృహలక్ష్మీ! గెంటిదారిద్ర్యమున్

సకలోత్తారక పూర్వగాథలహరుల్ సారస్య రస్యమ్ములై
సుకలాన్యాసముగూర్ప శారదకు సంశుద్ధాంతరంగాత్మలై
సికపూవాడని నిండు కీరితినిలక్ష్మీకాంత మాదుల్ కళా
స్తికతంగూర్తు సువర్ణపూజ గృహలక్ష్మీ! ధన్యతానన్యలై.

చల్లా పిచ్చయ్యశాస్త్రి, శతవధాని, ఇంటూరు.

♦ ♦ ♦ ♦

శ్రీ లక్ష్మీగిరిజా సతీసహితయా - శ్రీ శారదాపీఠమై
శ్రీ లన్ యీ గృహలక్ష్మి సంతతజయ శ్రీ - మంగళాశీస్సులన్
వాలాయంబుగగాంచి "వర్ధిల్లు" తన - వ్యద్భావ సంపత్తితో
మేలారీతుల సత్కళల్ జిలుకుచున్ - మించుప్రభల్ గాంచగన్.

## గృహీత కాశీస్సు

శ్రీ సతి భోగభాగ్యములు - చేకురజేయననంతదృష్టి - వా
ణీసతి కూర్పవాక్ప్రభలు - నిత్యశుభంబులు ఆయువృద్ధి గౌ
రీసతి కూర్పసంతతము - శ్రీ కరలీలల మోదమందుచున్
కేసరి దత్తకంకణము - కేలధరింపుము లక్ష్మికాంతమా.

తళుకు బెళుకొత్తు నీకవి-తాకుమారి-నడల. మురిపెంపు బలుకుల-నవ్యశోభ
పేరు ప్రఖ్యాతిగాంచుచు-గారవమున-కావ్యచంద్రికలన్నిల్పె-కవులుబొగడ.
అవని అద్వైత-నాంధ్రన వ్యాంధ్రకైత. పసలదేవించి దెలిపిన-బహుళశక్తి
గలదు శ్రీ లక్ష్మికాంతనీ-కలమునందు-సహజపాండిత్యసౌరభ-సరణియనగ,
ఆంధ్రభోజుడవనగ వి-ద్యాప్రసక్తి-మనము వేయేండ్లు కలిమిని-మాన్యచరిత
సరససాహిత్య సన్మాన-సభలగూడి దానకేసరివౌటమా-ధవునికృపను.
విదుషికవయిత్రివిమల వి-వేకసుగుణ-కవిత, సౌభాగ్యమాలక్ష్మి-కాంతయనగ
అట్టి సోదరి నరసిన-త్యంతవిధిగ-గౌరవించుట స్త్రీ జన-గౌరవంబు.

గిడుగు లక్ష్మీకాంతమ్మ, మద్రాసు.

◆ ◆ ◆ ◆

మానిత సత్య వాక్యరత మంజులహాస విశుద్ధమానసా
దానదయార్ద్రి శ్రీతలసుదక్షిణదివ్య కరాబ్జనిశ్చల
జ్ఞాననిదాన సాధుజన సన్నుత సత్కవిపోష కేసరీం
ద్రానిను వేంకటేశ్వరుడు బ్రోవుత పూర్ణచిరాయురోన్నతిన్.

యిటులే మేటేటను మీ వీటన్ కామేశ్వరమ్మ విలసన్ముఖియై
హాటక కంకణరవములు దీటుకొనన్ వెలుగనేమదిన్ న్నుతియింతున్.

శ్రీమతి సౌభాగ్యవతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి కాశీపురస్సరంబుగా

కలిమి బలిమికీర్తి గలిగి సౌభాగ్యవై-తెలుగు తల్లి కడుపు చలువదనర
నాంధ్ర సతుల కెల్ల నాదర్శయుతవేచు-మనగదమ్మ సుజన మాన్య చరిత
నెలతల తలమానికమా పలుకుల చెలి చేతిచిలుక బలికిన యటులన్
బలికితివి, దెలుగు కవయిత్రుల జీవితగాథ తెల్లతోరముగాగన్

కోమలి మల్లికాకుసుమ కుట్మలముల్ గల పొట్లమల్లనన్
కోమలలీల విప్పుమది గూర్చెడి హాయినిఁజెప్పశక్యమే



(162 పేజి చూడుడు)

# జయంత్యుత్సవమునకు సందేశములు



నమస్కారములు.

తమదయగల 'గృహలక్ష్మి జయంతి' ఆహ్వానము నేటి ఉదయం అందింది. చి. సౌ. సోదరి ఊ. లక్ష్మీకాంతమ్మగారికి కంకణం ప్రదానం చేయడం చాలా సముచితంగా వుంది. ఇందుకామె సదా సర్వదా అర్హురాలు. ఆమెకు నా ఆశీస్సులు. బ్రహ్మశ్రీ కేసరి బాబుగారికి నా వందనములు. తక్కుంగలవారికి నా అభినందనలు.

స్థానాపతి రుక్మిణమ్మ, విశాఖపట్టణం.



గృహలక్ష్మి జయంత్యుత్సవాహ్వాన పత్రికను కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములతో నందుకొంటిని. గృహలక్ష్మి ఆంధ్రలక్ష్మికి వేరుపేరని తెలుపుచుందును. తమ లక్ష్మి ప్రాంగణమున ఏటేట పూజ్యపాదులు డాక్టరు కేసరిగారొక విదుషీమణిని సత్కరించుట ముదావహము. భక్తురాలిపై పడుపూవు భగవతిపై పడును. నేడు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారిపై పడుపూవు సకలసద్గుణ నికురుంబమైన శారదాంబపై పడును. ఆంధ్రదేశమందలి యశస్తిలకలలో శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారొకరు. స్వర్ణ కంకణ బహూకృతులొసగు మా కేసరిగారు స్త్రీజనపురోభివృద్ధికై కంకణము గట్టుకొనిరి. ఆ పరార్థ జీవికి భగవంతుడాయురారోగ్యములను ప్రసాదించుగాక.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, విజయవాడ.



శ్రీమతి లక్ష్మీకాంతమా, సారస్వతేయత, యభినందనీయము. మీరది సంభావించిరి. గృహలక్ష్మి జయంతి శ్రీకంకణ శోభ కుంకుమ శోభిత శ్రీలక్ష్మీకాంతమకు సముచితము. సమకాలీన కవితావనితలు జనతకు మానితను మాన్యతను సంపాదింపగలుగుటలో మీసంకల్పమే, ప్రథమ కల్పము. ఇది యాకల్పమిట్లు ప్రశంసాస్పదమవుగావుత!

కంకణమన్నది మాంగళ్య మనోహరాలంకారము. ఇదియింకను విశిష్టము. కావుననే కంకణ ప్రదానము, కంకణసమర్పణమని నేను భావింతును.

అలంకార్య లక్ష్మీకాంతమా రూపవాగ్దేవి అలంకారము కంకణమ్ము
ఇది సన్మానము ఇదిసమ్మానము

శ్రీలక్ష్మీకాంతమా వ్యక్తిని, ఆమె సత్కృతిని, సచేతస్కముగమీరు సంభావించి, కంకణాలంకార మర్పించుచున్నారు. అలంకార మహంకారమీయదు. అలంకారము అలంకారమగును. సుశ్లిష్టాలంకారమగును. లక్ష్మీకాంతమా, కరానుగతమై ఆయమ మాంగళ్యమనోహర సారసారస్వతేయతను, అలంకరించుగావుత!

ఈసందర్భమున నాధర్మపత్నియు శ్రీలక్ష్మీకాంతమ నభినందించుచున్నట్లు వ్రాయ మనినది. ఎప్పుడేని, యొకవేదికపై లక్ష్మీకాంతమ ఉపన్యసించుట, నాధర్మపత్ని తాను పద్యములు చదువుట రెండును మిళితములు కావలెనని అనుకొనును. తాను ఈసమయ విశేషము సంభావించుచు శ్రీగృహలక్ష్మి జయంతి నిర్వాహకుల నందర నభినందించు చున్నది. నాధర్మపత్ని పేరు కామాక్షి హైమవతీదేవి.

జమ్ములమడక మాధవరామశర్మ, గుంటూరు.

♦ ♦ ♦ ♦

మీ కంకణ 'జయంతి వర్ధంతికి' నాహృదయపూర్వక శుభకాంక్షలు పంపు చున్నాను. 'గృహలక్ష్మి జయంతి' జయప్రదంగా సాగగలందులకు పూర్ణహృదయంతో పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

తమరు, ఆయురారోగ్యములతో విరాజిల్లి, ఇటువంటి జయంతి ఉత్సవములు పెక్కు వత్సరములు కొనసాగించి, స్త్రీ ప్రపంచమునకు అపార, ప్రోత్సాహ సంజనితమైన, కార్య ములను నడుప శక్తి గలిగియుండగలందులకు, సర్వేశ్వరుని సర్వవిధముల ప్రార్థించు చున్నాను.

నాహృదయ పూర్వక అభివందనములు.

కనకదుర్గాదేవి, మద్రాసు.

♦ ♦ ♦ ♦

ప్రాచీనకాలములో విద్యావిజ్ఞాన ఘనులగు రాజచంద్రులు, వారి సంస్కృతి ప్రేర ణచే, లలితకళా కోవిదుల సన్మానించి, ఆదరించి, ప్రోత్సాహ ఉత్సాహముల, విద్వత్కావ్యు లందుజనింపజేసేవారు. నేటి నవీన ప్రజాకాలములో విజ్ఞానులగు ధనికులే, ప్రజాపండిత కవుల ఆదరించవలసినది. మహిళాజనకుడగు శ్రీకేసరిగారు చిరకాలముజీవించుగాక! ఈస్వర్ణ కంకణము ఆదరణచిహ్నము. సన్మాన స్మరణ, భవిష్యత్ ప్రేరితా భరణము. ఇంతటితో,

ఆ విదుషీమణితో ఆగక నవకోమలకావ్య కన్యను, మృదుమధురభావ విలసితముగా అలంకరించుచుందురుగాక ! ఆమె మహిళా లోకమునకు, ఆదర్శజీవియై చిరకాలము జీవించవలెనని, ఆంధ్రమహిళల విద్యాభిలాషిణినగు, నేను వాంఛించుచున్నాను. రస హృదయజీవితమే తదితరుల నుత్తేజ పరుచుతూ, జ్ఞానభూముల, రసభరిత జీవఫలముల నాస్వాదింపజేయును, గాన ఈతరుణమున లక్ష్మీకాంతమ్మగారి విద్వత్తుకు - ప్రోత్సాహ పుత్తడినగ. యావదాంధ్ర మహిళలకు ఆ విద్యాజ్ఞాన వెల్లువల, శిఖరమందుకొన, నవోత్సాహము గల్గించి, దారిజూపు పూజనీయులగు శ్రీకేసరిగార్కి, కంకణ గృహీతకు నా ధన్యవాదములు.

వాశిరెడ్డి సుశీలాదేవి, తుమ్మపూడి.

◆ ◆ ◆ ◆

నమస్కారములు. తమరు దయతో పంపిన అహ్వానము అందుకొంటిమి. శరీరములో స్వస్తత లేనందువల్ల గృహలక్ష్మి జయంత్యుత్సవములో పాల్గొని ఆనందించు భాగ్యము నాకు లేనందుకు చింతిస్తున్నాను. తమ జయంత్యుత్సవములు ప్రతిసంవత్సరము జరుపుటకు శ్రీరామచంద్రమూర్తి తమకు "ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి బ్రోచుగాత !"

ఈసంవత్సరము తమ గృహలక్ష్మి కంకణమందుకొనుచున్న శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగార్కి వారి భర్త శ్రీయుత ఊటుకూరి హయగ్రీవగుప్తగార్కిని వారి సంతానమునకును శ్రీరామచంద్రమూర్తి "ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి బ్రోచుగాత" అని ప్రార్థిస్తూన్నాను.

సి. హెచ్. శేషశయనం నాయుడు, బాపట్ల.

◆ ◆ ◆ ◆

తాము దయతో పంపిన ఆహ్వానము అందినది.

డాక్టరు కేసరిగారు ఆంధ్ర దేశమునకు అఖండ సేవజేసినారు. చెన్నపురి ఆంధ్రులకు ఒక హైస్కూలును దానము చేసారు. స్త్రీల సేవకై "గృహలక్ష్మి"ని స్థాపించి జయప్రదముగా జరుపుచున్నారు. వారి లోధ్ర స్త్రీల పాలిటి కల్పతరువే. స్వయం శక్తివలన పైకి వచ్చి దేశమునకు అఖండ సేవచేసిన ఆంధ్రులలో డాక్టరు కేసరిగారు ఒకరు. డాక్టరు కేసరిగార్కి నాకృతజ్ఞతా వందనములను సమర్పించుచున్నాను.

సందేశములు

1953లో కంకణము స్వీకరింపనున్న శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు మా వూరు ఆడపడుచు. ఆమెను గౌరవించుటవలన రాజమహేంద్రవర స్త్రీలనందరను గౌరవించినట్టుగానే తలుస్తున్నాను.

కొన్ని సంసార చిక్కులవలన సభకు రాజాలనందులకు క్షమించ కోరుతున్నాను.

పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు, రాజమండ్రి.
ఎడిటర్ 'ప్రేమజ్యోతి'

♦ ♦ ♦ ♦

ఈ రోజున పూజ్యులు కేసరిగారు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము చేసి సత్కరించడం మహిళాలోకానికి మితిలేని సంతోషదాయకం.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు విదుషీమణియేకాక సంఘసేవాభిలాషి. ఆమె వాగ్ధాటి ప్రశంశింప తగినది. ఈ మధ్యనే యీమె రచించిన 'ఆంధ్రకవయిత్రులు' అను గ్రంథము ఉత్తమమయినదిగా గుర్తించబడి తెలుగు భాషా సమితిచే సత్కరించబడిన విషయం లోకవిదితం. ఈ గ్రంథం పరిశోధనా పూర్వకమయినదియు, అమూల్యమైనది కూడాను. తెలుగు సాహితరంగంలో యీనాడేకాక రానున్న తరతరాలకు యీ గ్రంథము మహోపయుక్తముగా నుండగలదు. అంతేకాక కళాపిపాసి, ఆదర్శనీయమైన గృహిణికూడాను.

ఇక 'గృహలక్ష్మి'పత్రిక ద్వారా యిట్టి సన్మానసత్కారములు జరుగడంమూలంగా యీపత్రిక ముందు వెనుక చరిత్రలు ప్రస్తాపన చేయవలసిన ఆవశ్యకత ఎంతైనయున్నది.

పత్రిక స్థాపన నాటినుండి మహిళాపురోభివృద్ధికి కృషిచేయడమే లక్ష్యము. విద్యాలేమివలన, అజ్ఞానులుగా, అమాయకులుగా క్రుంగిపోతున్న మహిళాలోకాన్ని చూచి జాలితోవారిని ఉద్ధరించడానికి, వారి పురోభివృద్ధిని సాధించడానికి శ్రీ కేసరిగారు యీ పత్రికను స్థాపించి 25 సం॥లనుండి నడుపుచున్నారు. దానిఫలితంగా పురోభివృద్ధి కనుపిస్తున్నదను విషయం లోకవిదితం. ఇంకా ఆంధ్రనారీలోకం పత్రిక ఆదరించి, అభిమానించి తమ స్వప్రయోజనానికి వినియోగించుకోవలసిన బాధ్యత తమది. దాంతో పాటు శ్రీ కేసరిగారు పత్రిక చిరస్థాయిగా నుండునవకాశములు కల్పించి శాశ్వతకీర్తి ప్రతిష్టలకు పాత్రులుకావాలని నా ఆశ; అదే ఆంధ్ర నారీమణుల అభిమతంకూడాను.

చివుకుల లక్ష్మీకాంతమ్మ, మద్రాసు.

నమస్కారములు,

గృహలక్ష్మి జయంతికి రమ్మని తాము పంపిన ఆహ్వానము అందినది. ప్రయా ప్రయాసల ప్రయాణమునకు, తగని అనారోగ్యస్థితివల్ల జయంత్యుత్సవమునకు రాజాల నందుకు విచారము తెలుపుచున్నాను.

తెలుగు విద్యావ్యాప్తికై నిరంతర కృషి సల్పుచు, చెన్నపురి ఆంధ్రులదే అని నిశ్చయపరచుచున్న మీ ఔదార్యము ఆంధ్రభాషకు ఆంధ్రజాతికి పట్టుగొమ్మ, అను సత్యము జగద్విదితము. శ్రీమంతులెందరో ఉన్నారు. కాని తమ సిరిసంపదలను సద్విని యోగము చేయుభాగ్యము ఎవరికోగాని లభింపదు. అట్టి భాగ్యశాలులగు తమకు, యావదాంధ్రజాతి తరతరములు ఋణపడి యుండుననుట సమాసోక్తి. ఆంధ్రజాతికి సర్వాలంకృతయగు గృహలక్ష్మిని ప్రసాదించిన స్వభాషాభిమానులు మీరు. ఏటేట సువర్ణాలంకారముతో సత్కరించుచు ఆంధ్రరచయిత్రులకు ప్రోత్సాహ మొసంగుచున్న తమ స్త్రీ సాహిత్యాభిమానము తెలుగువారు, స్త్రీ పురుషాదులు కర్పూరనీరాజన మెత్త దగినది. స్తుతి ప్రశంసల కాశింపని మీ యౌదార్యమునకు, మీకృషికి మనఃపూర్వక నమో వాకములు. ఈనాడు తాము సువర్ణకంకణ ప్రదానముతో గౌరవించుచున్న చి॥ సౌభా గ్యవతి లక్ష్మీకాంతమ్మ సర్వవిధముల అర్హురాలు. ఆమె తన రచనలతో స్త్రీ సాహిత్యా భ్యుదయమునకై కృషిచేయుచు, ఇతోధికముగ యావదాంధ్రుల సత్కార గౌరవముల నందుగాతయని వయోవృద్ధుడనుగాన శ్రీమతిని దీవించుచున్నాను. ఉత్సవము మహా వైభవముగ జరుగుగాక.

వేదుల సత్యనారాయణశాస్త్రి, సామర్లకోట.

♦ ♦ ♦ ♦ ♦ ♦

నమస్తే,

తాము పంపిన జయంత్యుత్సవ ఆహ్వానము చేరినది. కృతజ్ఞుడ. ఇచటగల కార్య బాధముచే స్వయముగవచ్చి ఉత్సవకార్యక్రమమునందు పాల్గొనజాలనందులకు మన్నించ గోరెద. జయంత్యుత్సవము విజయవంతముగా నెరవేరునట్లు "గృహలక్ష్మి" చిరకాలము వర్ధిల్లునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక! మీచే ఈసంవత్సరము సువర్ణకంకణము స్వీకరించుచున్న మాసోదరి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ ధన్యురాలు. ఆమెకు పరమేశ్వరు డాయురారోగ్యముల నొసంగి యింకను ఎక్కువగ ఉత్తమ గ్రంథరచనలకు తోడ్పడునట్లు అనుగ్రహించుగాక!

అ. శ్రీనివాసరావు
సారస్వతనికేతనం, వేటపాలెం.

నమస్కారములు

తాము దయతో పంపిన 'గృహలక్ష్మి జయంతి' ఆహ్వానమందినది. పనుల తొందరలో రాజాలమికి చింతిల్లుచూ, ఉత్సవసభ జయప్రదముగా జరుగుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను. ఈ సం॥రం శ్రీమతి లక్ష్మీకాంతమ్మగార్కి బహూకరించుట సంతోషదాయకము. సెలవు.

మల్లెల శ్రీరామమూర్తి, విజయవాడ,
ఎడిటర్ 'విజయవాణి'

♦ ♦ ♦ ♦

నమస్కారాలు.

గృహలక్ష్మి జయంతి ఆహ్వానము అందినది. ఈసారి స్వర్ణకంకణ ప్రదానము సోదరి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారికి చేయడానికి తాము నిర్ణయించడం సంతోష ప్రదము. నేటి విదుషీమణులలో మరియు వచన రచయితలలో శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారికి ప్రముఖ స్థానము కలదని వారి "ఆంధ్ర కవయిత్రులు" నిరూపించుచున్నది.

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారికి నాయొక్కయు, మరియు మా పరిషత్తు యొక్క శుభాభినందనలు తెలియ జేయండి.

తాము ప్రతి సంవత్సరము ఇట్టి ఉత్సవాలు జరుపుచు విదుషీమణులను సన్మానించుచు చేయుచున్న ప్రయత్నాలను యావదాంధ్రముతో పాటు మా తెలంగాణము కూడ హర్షించుచున్నది.

దేవులపల్లి రామానుజరావు,
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్,

♦ ♦ ♦ ♦ ♦ ♦

I thank you for your invitation for the Grihalakshmi Jayanti Celebrations on 8th instant. I regret I will not be able to respond to the invitation as I happen to be away from the city that day. All the same I send my best wishes for a successful function and a bright future for " Grihalakshmi. "

Yours sincerely,
S. B. P. Pattabhi Rama Rao.
Minister for Rural Welfare, commercial taxes and scheduled areas.

Sri K. Venkataswami Naidu, Minister for Religious Endowments and Registration, thanks Sri K. N. Kesari for his kind invitation on the occasion of the Grihalakshmi Jayanti Celebrations on 8-3-1953 and wishes the function all success.

♦ ♦ ♦ ♦

I am so thankful to you for the kind invitation for the celebrations of Grihalakshmi Jayanti. I wish the function all success. May the blessing of Sri Meenakshi and Sri Sundareswarar be also with you on this auspicious occasion.

Yours affectionately

K. K. Menon, B.A., B.L., Madurai.

♦ ♦ ♦ ♦

Mr. C. S. Loganathan thanks Mr. K. N. Kesari for his kind invitation on the occasion of the Grihalakshmi Jayanti celebrations on sunday 8-3-1953 at 4 p.m. at Kesari Kuteeram, 15, Westcott Road, Royapettah, Madras and regrets his inability to attend the same as he will be out of Madras on that date. He wishes the function every success.

♦ ♦ ♦ ♦

Thanks for the invitation. Sorry for my inability to attend the function due to previous occupation. I wish the function all success.

K. L. Kantham, Madurai.

# స్త్రీ సమస్యలు



## విద్య

స్త్రీకి విద్య అవసరమా, అనవసరమా అనేదే యింతవరకు పెద్ద సమస్యగా పరిణమించింది. కాని ప్రస్తుతం ఆధునికయుగంలో చాలామంది స్త్రీలు విద్యాభ్యాసానికి పూనుకోవడం వల్ల యిప్పుడా సమస్య అంతగా పట్టింపుకు రావడంలేదు. మన దేశంలో విక్టోరియా మహారాణి పరిపాలన దగ్గర నుంచి స్త్రీ పురుషులకున్నత విద్యలయందు కొంత ప్రోత్సాహమివ్వబడింది. అంతకు పూర్వం యీస్టిండియా కంపెనీవారు అసలు ప్రాథమిక విద్యకే ప్రాధాన్యత యివ్వలేదు. అయితే యిప్పుడు స్త్రీకి వున్నతవిద్య అవసరమా? సామాన్య విద్య అవసరమా? అనేది పెద్దచిక్కుగా యేర్పడింది. చాలామంది యీ విషయమై వాదోపవాదాలు చేస్తూవుంటారు. కొందరు వున్నత విద్య అవసరమని, మరికొందరు సామాన్య విద్యవుంటే చాలునని వాదిస్తారు. కాబట్టి యీ విషయమై నేనుకూడ కొంచెం వ్రాయదలచుకున్నాను. దయవుంచి చదవండి.

యీనాడుకూడా పూర్వపు పద్ధతులను అవలంభించే స్త్రీలులేక పోలేదు. ఆడవాళ్లు చదువుకుంటే చెడిపోతారని, పురుషులతో కలిసి కాలేజీలలో చదవటంవల్ల కొన్ని చెడుఅలవాటులకు లోనవుతారని, యింట్లో తల్లిదండ్రులకు, తక్కినపోషకులకు లొంగి వుండరని వారివుద్దేశం. కాని చెడిపోవలసినవాళ్ళు యెలాగైనా చెడిపోతారు. చెడిపోయేవారిని బాగుచేసేవారూ లేరు. బాగుపడేవారిని యెవరూ చెడపాలేరు. అందుచేత ఆడపిల్లలు బడికివెళ్ళి యింటికివచ్చినంతమాత్రాన చెడిపోతారనుకోవడం చాలాపొరపాటు. పూర్వకాలంలోకూడా చదువుకున్నవాళ్ళు లేకపోలేదు. అయితే ఆనాటి విద్యావిధానంవేరు. వారు వేదములు, శాస్త్రములు, వృత్తివిద్యలు అభ్యసించెడివారు. ఆనాడు అంతామంత్ర శక్తిమీద ఆధారపడివుంటే, యీనాడు ప్రపంచమంతా యంత్ర శక్తిమీదఆధారపడివుంది. పూర్వకాలంలో ఋషులు, రాజులు, పతివ్రతలు మొదలైన వాళ్ళు యెవరిపైనను దండెత్తవలసివచ్చినను లేదా యేదైనా కార్యము సాధించవలసివచ్చినను మంత్రశక్తివల్ల సాధించుకొనే వారు. శ్రీరాముడు రావణాసురునిపైకి బ్రహ్మాస్త్ర మంత్ర పఠనము గావించి ఒకబాణమును వదిలేడు. ఆ బాణము బ్రహ్మాస్త్రమై పొగలు గక్కుతూ వెళ్ళి రావణాసురిని హతమార్చింది. అయితే ఆనాటి బ్రహ్మాస్త్రమే యీనాడు మంత్రశక్తివల్ల 'ఆటంబాంబు' అను పేరుతో వుపయోగించబడుతోంది. కాబట్టి యంత్రశక్తికి, మంత్రశక్తిగలతేడా యేమిటో కొంచెం విచారిద్దాం. ఒకబాణమును మంత్రించి వదలినట్లయితే ఆ బాణమువెళ్ళి యే వ్యక్తినైతే సంహరించాలో ఆ వ్యక్తినే చంపితిరిగి వచ్చేస్తుంది. అదే ఒక ఆటంబాంబును ఒకపట్టణముపై ప్రయోగించితే ఆదేశమెల్లా సర్వనాశనం అయిపోతుంది. అందుకనే మనపూర్వులు మంత్రశక్తిచాలా గొప్పదన్నారు. మంత్రశక్తివల్ల సాధించగలిగిన కార్యాలు యంత్రశక్తివల్ల సాధించడం చాలాకష్టం. యీనాటి మానవులలో నీతినియమాలు, నిజాయతీనశించటంవల్ల మంత్రశక్తికూడా నశించింది. కాని యిప్పుడు తంత్రశక్తిమాత్రం వృద్ధిపొందుతోంది. చిల్లంగి, గారిడీ, కనికట్టు మొదలయిన తంత్రాలవల్ల ప్రజలను మోసంచేసి డబ్బుదోచుకోవడం తప్ప మరే ప్రయోజనము లేదు.

పతివ్రతలలో సీతా, సావిత్రి, దమయంతి, రుద్రమదేవి, రాణీసంయుక్త, ఝాన్సీలక్ష్మీభాయి మొదలైన వారంతా చదువుకున్నవాళ్ళే. విద్యలలో అనేకరకాలు వున్నాయి. యెన్ని వున్నా 'కోటి విద్యలు కూటి కొరకే' యని, యేవిద్య అభ్యసించినా పొట్టకూటికొరకే. అయితే కొందరు పొట్టకోసం పాటుపడవలసిన అవసరంవుండదు. యెందుచేతనంటే

అటువంటివారికి జీవితమల్లా అనుభవించడానికి పెద్ద పెద్ద జమీనులుగాని ధనముగాని వుండవచ్చు. అలాటివారు జ్ఞానము సంపాదించుకోడానికి మాత్రము చదువుకోవాలి. విద్యలేనివారు అంధులు. అంధునకు ప్రపంచమెట్లగుపడునో విద్యలేనివానికి అట్లే అగపడును. యెన్ని ధనధాన్యాలు వున్న యెంతడబ్బువున్న 'విద్యను మించుధనంబులేదుయిలను' అన్నట్టు విద్యనిగూడ గుప్తమగువిత్తము. ఆటువంటి విద్యఅభ్యసించటం చాలా ముఖ్యం. కొందరు పురాతన స్త్రీలు ఆడది చదువుకుంటే మాత్రం వుద్యోగం సద్యోగం చెయ్యాలా, ఆ మొగాడే కష్టపడిడబ్బుతెస్తాడు. ఆడదానికి యేదో చాకలిపద్దురాయడంవస్తే చాలు అని అంటారు. మనదేశంలో, కుటుంబంలో ఒక వ్యక్తి డబ్బు సంపాదించడం, తక్కినవారంతా అతని మీద ఆధారపడివుండటం ఒక పెద్ద అలవాటయిపోయింది. పదిమందిగల ఒకకుటుంబములో ఒకమనిషి కష్టపడి డబ్బుతేవాలీ అంటే, అతను యెంత కష్టపడగలిగితే ఆ పదిమందిని పోషించగలుగుతాడు? యీ ఆలోచన యెవరికీవుండదు. యెంతసేపు మొగాడు కష్టపడ్డంలేదు, డబ్బుతేవటంలేదు, కావలసిన వస్తువులు తేవటంలేదు అనే అంటారు, కాని ఒకవ్యక్తి యింతకుటుంబాన్ని యెంతో కష్టపడి పోషిస్తున్నాడు గదా! అని ఆలోచించేవారు చాలా అరుదు. విదేశములలో చూస్తే సర్వసాధారణంగా ప్రతికుటుంబములోను అంతమందీ కలిసి యేదో విధంగా పనిచేసి డబ్బు సంపాదించుకుంటారు. అందుకు వారికి వృత్తి విద్యలు యెక్కువగా తోడ్పడతాయి. యిందుకు రష్యా, చైనా, అమెరికా, జపాను దేశములను మనము వుదాహరణముగా తీసుకోనవచ్చును. ఆయా దేశపు ప్రజలనుండి మనము నేర్చుకోనవలసిన విషయాలు యెన్నోవున్నాయి. యిప్పుడిప్పుడు మన దేశంలో కూడ వృత్తివిద్యలకి, వయోజనుల విద్యకి ప్రభుత్వం యెక్కువ ప్రాముఖ్యత యిస్తున్నాది. ఆ ప్రణాళికవల్ల వయోజనులంతా విద్య అభ్యసించడానికి వీలుకలుగుతుంది. యిప్పటి రోజుల్లో చదువు నేర్చుకోవడం కష్టమైన పనికాదు. యెందుకంటే సాధారణంగా ప్రతిపల్లెటూరిలోను యేదో ఒక వీధిబడివుండనే వుంటుంది. యింకా ప్రతిపల్లెటూరిలోను పాఠశాలలు స్థాపించడానికి ప్రభుత్వం పూనుకుంటునేవుంది. అయితే మనలో వుండేది ఒక్కటే లోటు. అదియేమిటంటే, చదువుకునేవారికి తగిన ప్రోత్సాహం యివ్వకపోవడమే. కర్మంచాలక యెవరైన పిల్లలు చదువుకుంటానంటే, ఆ! మన కులంలో చదువుయెవరికివుంది! యేదో మనకులవృత్తులయిన కర్రలు కొట్టుకొనుట, అంట్లుతోముకొనుట మానివేసి, నీ మొఖానికి చదువు ఒకటా! అనేరు. యిన్ని అవరోధాలు యెదుర్కొని ఒకవేళ వాళ్ళు చదువుకోవడానికి ప్రారంభించినా తగినప్రోత్సాహం యివ్వరు. యేదైన ఒక సంవత్సరం కర్మవశాత్తు పరీక్ష తప్పిందంటే, నీ మొహానికి చదువుయెందుకు లెద్దూ! మాకు డబ్బుదండుగ నీకు అబ్బకపోవడం. అని మాన్పించేస్తారు. అయ్యో! ఒకసంవత్సరం పరీక్షపోతేనేం, మళ్ళా చదివిద్దాము, కష్టపడి చదువుకొని పరీక్షలు ప్యాసయిన తరువాత ఖర్చు అయిన డబ్బుకి నాలుగురెట్లు సంపాదించుకోనవచ్చును, అని ఆలోచించేవారు చాలా కొంచెమంది.

ఒక కుటుంబంలో భార్య, భర్త, యిద్దరు పిల్లలు వున్నారు అనుకోండి. కర్మవశాత్తు ఆ భర్తకి యేదైన జబ్బుచేసి, నిస్సహాయుడై, యితరత్రా మరే ఆస్తిపాస్తులు లేనట్లయితే, చదువుకున్న యిల్లాలే అయినట్లయితే, యెవరినైన ఆశ్రయించి ఒకచిన్న వుద్యోగం సంపాదించుకొని ఆ కుటుంబాన్ని పోషించుకొనవచ్చును. అలాగ కాకపోతే అట్టి ఆపదసమయంలో రోగగ్రస్తుడైన భర్తతోను, పిల్లలతోనుకలిసి యేనడి సముద్రంలోనో పడ్డం తప్ప మరే గత్యంతరంవుండదు. అందుకనే సర్వసామాన్యప్రజానీకానికి అందుబాటులో వుండే సామాన్యవిద్యనైనా అభ్యసించాలి. స్కూల్ ఫైనల్ క్లాసుకి లోపునవున్న తరగతులన్నీ సామాన్యవిద్య క్రిందనే లెక్కకువస్తాయి. వున్నతవిద్యఅంటే మెట్రిక్లేషనుకిపైబడిన చదువు. అంటే కాలేజీక్లాసులన్నమాట. సామాన్యవిద్య అభ్యసించడానికే యెన్నో ఆటంకాలు యెదుర్కొంటూ

వున్న నేటి నారీమణులు, వున్నత విద్య అభ్యసిస్తేనే గాని లాభంలేదనడం, వున్నత విద్య తప్పనిసరిగా నేర్చుకోవాలని పట్టుపట్టడం చాలా అవివేకం. ఒక స్త్రీ ఎనిమిదవతరగతి ప్యాసుఅయివుందంటే, అవసరాన్నిబట్టి ఆమె యేలోయర్ గ్రేడు మాష్టరుట్రయినింగుకైనా పోవచ్చును, లేదా స్కూల్ ఫైనల్ ప్యాసు అయితే యేదైనా ఆఫీసులో గుమస్తాపని సంపాదించుకోవడానికి అవకాశంవుంది. వున్నత విద్య అక్కర్లేదని నేను చెప్పను. పెద్దచదువులు చదువుకోవటం వల్ల పెద్దపెద్ద వుద్యోగాలు చేయవచ్చును. పెద్దపెద్ద లేబరేటరీలలోను, ఇనుస్టూట్యులలోను పరిశోధకులుగా వుండవచ్చును. విదేశాలు వెళ్ళి శాస్త్రజ్ఞానం అభివృద్ధి పరచుకోనవచ్చును. అనేకమైన అవకాశాలువున్నాయి. అందరూవున్నత విద్య అభ్యసించాలి అంటె చాలాకష్టం. యెందుకంటే అందరూ డబ్బున్నవాళ్ళు వుండరు. అందుకు తగినఅవకాశాలు కలిగివుండరు. అన్ని అవకాశాలు సమకూడినప్పుడు వున్నత విద్యలు అభ్యసించడం చాలా మంచిది. యేమైనప్పటికీ ప్రతీస్త్రీ, ప్రతీపురుషుడుకూడా సామాన్యవిద్యనైనా అభ్యసించడం చాలాముఖ్యమైన విషయం. యెన్ని అవరోధాలు కలిగినప్పటికీ చదువుమాత్రం మానివేయకూడదు. ఒక కుటుంబములోని స్త్రీ చదువుకున్నదైతే ఆమె పిల్లలుకూడా సుళువుగా చదువుకోనగలుగుతారు. పిల్లలు తండ్రి దగ్గరకంటే తల్లిదగ్గరనే యెక్కువచనువుగా వుంటారు కనుక, ఆమె వారికి నయానో, భయానో పాఠాలు నేర్పగలుగుతుంది. తల్లి విద్యావంతురాలు అయితే ఆ పిల్లలుకూడా విద్యావంతులు అవుతారు. దేనికైనా వుత్సాహం ప్రోత్సాహం ముఖ్యంగా అవసరం.

నందివాడ కామేశ్వరరావు



# సుఖాప్తి

శ్రీమతి నన్నపనేని మంగాదేవి.



ఎన్నటికో సుఖాప్తి
ఈ దుఃఖమహాసమాప్తి

ఎన్నాళ్ళని స్త్రీ జనాళి
సహిస్తుంది కొఱకొఱలను
ఎన్నాళ్ళని కంటినీరు
కురిపిస్తుంది బొటబొట

పురుషాజ్ఞలో నెంతవఱకు
అణగుతుంది బోడికూటమి
వికసించే క్రొన్ననల
వెదజల్లే వాసనల

ఎన్నాళ్ళని పురుషుల
కల్మష వింతదుఫులు

కమ్మేస్తాయి చీకటి
ఆపేస్తాయి మాకటి
ఎంతవఱకు-కాంతామండలం
గొంతికలో మూల్గుతుంది
ఈ దీను దారధ్వని
కరగిస్తుంది అవని

ఎన్నాళ్ళని మగువల
వేడినిట్టూర్పు గాలుల
వహిస్తాము మనం
భరిస్తుంది జగం

ఎన్నటికో సుఖాప్తి
ఈ దుఃఖ మహాసమాప్తి



సీరియల్ నవల :

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

అది సోమవారము ఉదయము.

స్వామి మాత్రం కళ్లు విప్పేందుకిష్టపడటంలేదు. స్వామి దృష్టిలో, కేలండర్నందు—'సోమవారం' అనవసరపు దినముగా పరిగణింపఁబడుతూంది. శనివారమును, ఆదివారమును, ఎంతో స్వేచ్ఛగాను—మధురంగాను గడిపిన తరువాత, 'సోమవారము' నాఁడు వేకువనేలేచి, బడికిపోయే కార్యక్రమమందు ప్రవేశించేందుకు స్వామికి బద్ధకంగానేయుంది. స్వామి వొక్కమారు కళ్లుమూసుఁగుని—తన పచ్చటి స్కూలు బిల్డింగును – చింతనిప్పులువంటి కళ్లనుఁ కలిగిన తన క్లాసుటీచర్ను - వొలంపాటి బెత్తును ధరించి, యెల్లవేళందూ వరండాలలో తిరిగే తన హెడ్మాష్టర్ను తలచుగోఁగానే, వొళ్లు వొక్క మారు పులకరించింది!

ఎనిమిది గంటలకల్లా స్వామి తనగదిలోని డస్కు ముందరఁ గూర్చున్నాడు. టేబిలు మీఁద, స్వామి-టోపి, కోటు, పలక - సిరాబుడ్డి, పుస్తకములు చిందర వందరగాను, గుట్టగాను పఁడున్నాయ్. కళ్లొక్కమారు మూసుగుని, యీరోజుకు చేయవల్సిన స్కూలు వర్క్ మిటా అని ఆలోచింపసాగాడు.

స్వామినాథన్ నలుగురి స్నేహితులను సంపాదింపఁ గోఁగలిగాఁడు. మొదటివాఁడు: సోము; స్వామి చదువుతూన్న క్లాసుకు మోనిటర్. ఏదేట్లున్నా - సోము మాత్రం యెవరి జోలికి పోకుండా తన పనేదో చేసుకు పోతూంటాడు. సోము తెలివయిన విద్యార్థులలో వొకడనే చెప్పాలి.

రెండవవాడు: మణి (The mighty good-for-nothing fellow) క్లాసులోని విద్యార్థులందరికంటే చాలా పొడగరి. స్కూలుకు వచ్చేటప్పుడు పుస్తకాలు తేనే తేడు. హోంవర్క్ యేజన్మ మధ్యమందూ చేసినపాపానపోలేదు. క్లాసుకు వచ్చిన తరువాత వెనుక బెంచీలో, గూర్చుని తెలివిగా నిద్రపోతూ వుంటాడు. మణిని యే వుపాధ్యాయుడూ బాధించేందుకు ప్రయత్నించఁడు. ఎవరయినా క్రొత్తవుపాధ్యాయుడు - మణిని బాధించినట్లయితే, నిజంగా ఆ వుపాధ్యాయుడు తన జీవితాన్కి నీళ్లు వొదులుకొనే ఆ పని తలపెట్టాలన్నమాట. మణి రోడ్డుమీదనుండి పోతూంటే, యితని స్వభావం తెల్సినవ్యక్తులందరూ మణికి చాలా దూరంగానే వుండి నడుస్తూవుంటారు. ఒకకోణంలో టోపీని శిరస్సుకు తగిలించి, చంకలో తమిళ నవల పెట్టుగుని స్కూళ్లుకు వేంచేస్తాడు. స్కూలు పుట్టిన దగ్గరనుంచి యేయేబంట్రోతులు పని చేసుకు వచ్చారో, యిప్పుడున్న వారెవరెవరో మణికి క్షుణ్ణంగా దెల్సు! దీనినిబట్టి - మణి ఒక్కొక్క తరగతియందు యెన్నేసి సంవత్సరములు దండయాత్ర చేశాడో మనం సులభంగా గ్రహించవచ్చు!

ఇటువంటి స్నేహితులు తనకు లభ్యమయినందుకు స్వామెంతో పొంగిపోయేవాఁడు. అందరూ 'మణిగారూ' అని పిలిస్తే, స్వామిమాత్రం - 'ఏంరామణీ' అని పిలిచేవాఁడు! ఒకమాటు స్వామితో తన జోలికి పోయినవారి వీపులను సాఫీ చేయటాన్కి వీలుగా యింటి దగ్గర రెండుగదలున్నాయని చెప్పినట్లు జ్ఞప్తి!

మూడవవాడు: శంకర్! క్లాసులో వున్న విద్యార్థులందరికంటే చాలా తెలివైన వాడు. ఎటువంటి లెఖ్ఖిచ్చినాసరే, అయిదు నిముషములలో చేసేశక్తి శంకర్కుంది. ఎప్పుడూ శంకర్కు లెఖ్ఖల్లో నూటికి 90 మార్కులకు తక్కువరావనే చెప్పుఁకోవాలి! ఈ

తోంభైమార్కులు తను ధరించిన తెల్లదుస్తులనుఁ జూచి వుపాధ్యాయులు యిస్తూంటారని శంకర్ తనతోటి విద్యార్థులతో చెప్పుగోవటం కద్దు! ఉపాధ్యాయులతో చాకచక్యంగా యింగ్లీషులో మాట్లాడేశక్తి శంకర్కుంది. యీ విశాల విశ్వంలోగల నదులు, పర్వతములు, పట్నములు వాటికి సంబంధించిన జాగ్రఫీ వివరములు శంకర్కు కుణ్ణంగాఁదెల్సు! గాథనిద్దర్లో, 'చరిత్ర'ను వల్లె వేయడంకద్దు! ఆడపిల్లలకుమల్లే జడవేసుగుని, అందులో పువ్వులు తురుముకొని స్కూలుకు వస్తూవుంటాడు.

నాల్గవవాఁడు: శామ్యూల్ (బతాణీగింజ): శామ్యూల్ ముఖం బతాణీగింజమల్లే గుండ్రంగా వుండటంచేత 'బతాణీగింజ' అన్న మారు పేరు శామ్యూల్కు విద్యార్థులు బహూకరించారు. స్వామికంటే లెఖ్ఖల్లో చాలా బలహీనంగానే వుంటాడు. ఎప్పుడూ మూతికడ్డంగా చెయిప్పెట్టుకుని నవ్వుతూనే వుంటాడు.

## 2

సరయూనది మాల్గుడికి వుత్తరదిశగా ప్రవహిస్తూంది. మ్యునిసిపల్ ప్రెశిడెంటు యెవరయినా విజిటర్సు వచ్చినపుడు లౌనుహోలు మీదభాగమునకు దీసుగొనిపోయి, చంద్రకాంతిలో రజిత పటకామల్లే తళతళ మెరుస్తూ, వుత్తరంగా ప్రవహించే సరయూ నదిని జూపించి యెంతో గర్వపడేవాఁడు!

షికారుకు రోజూ వచ్చే ప్రజంతా సరయూనదిని చేరుకుంది. స్వామి, మణి నది వొడ్డుపై గూర్చుని నీట్లో కాళ్లాడిస్తున్నారు. నదీతలంపై వ్రాలిన రావి కొమ్మలను నదీవుత్తుంగ తరంగములు ఢీకొని చెవులకింపైన నాదమును సృష్టిస్తున్నాయ్. పదిహేను నిముషముల తరువాత పశ్చిమాకాశములో స్నిగ్ధమయిన యెరుపు అలుముకుంది.

“ఇక్కడ నీరు చాలా లోతుగా ప్రవహిస్తున్నాది గదూ?” మణి ప్రశ్నించాడు.

“అవును, ఎందుకూ?” స్వామి ప్రశ్నించాడు.

“'రాజమ్'ను త్రాళ్లతో చేతులు, కాళ్లూ కలియఁగట్టి, యీనదిలోకి గిరవాటువేస్తాను!” అన్నాడు.

'రాజమ్' అనే కుర్రవాడు ఒకటవఫారం. ఏ. తరగతిలో క్రొత్తగా వచ్చి ప్రవేశించాడు. స్కూలు తెరచిన రోజున రాజం ఠీవిగా క్లాసుకువచ్చి, వెనుక బెంచీలో మణిప్రక్కనఁ గూర్చున్నాడు. ఆ ఆఖరు బెంచీలో మణిఁదప్ప, మరెవ్వరూ యెరిగి మరిచిఁ గూర్చుండరు. మణి తనయలవాటు ప్రకారము మణుకుతో రాజం ప్రక్కలో పొడిచాడు. రాజంమాత్రం ఆ క్లాసులోని చేతకాని విద్యార్థులవలెఁగాకుండా, తనూ మణి ప్రక్కలో పొడిచాడు. తనకు యీనాఁడు యెదురు తిరిగిన వ్యక్తి కన్పించినందుకు మణెంతో విస్తుబోయాడు. మణి తన విషయంలో యేమిటి చేసేవాడో, రాజంగూడా మణివిషయంలో అదే చేసేవాఁడు.

రాజం క్రొత్తగా వచ్చిన వ్యక్తి స్కూలుకు వచ్చేటప్పుడు మంచి కాకీ దుస్తులు ధరించేవాడు. ఆక్లాసుకంతటికీ-సాక్సు, షూస్ ధరించి వచ్చేవాడు ఒక్క రాజమ్ మాత్రమే. దీనినిబట్టి రాజమ్ మంచి విద్యార్థి అన్న సదభిప్రాయం ఆక్లాసు విద్యార్థులలో వ్యాపించింది. మదరాసులో - యేదో యింగ్లీషు కుర్రవాళ్ల బడినుండి రాజమ్ యిక్కడకు వచ్చాడన్న వదంతులు ఆక్లాసు విద్యార్థులలో వ్యాపించకపోలేదు. ఇంగ్లీషు రాజం చకచకా మాట్లాడగలడు. రాజం మాట్లాడే యింగ్లీషును అర్థంచేసుకునేవారు చాలా తక్కువనే చెప్పాలి. ఆక్లాసుకంతటికీ జీనియస్సైన శంకర్ మాత్రం రాజంతో యింగ్లీషున మాట్లాడేవాఁడు!

ఇప్పుడు రాజం, మణికి పరమశత్రువయ్యాడు. మణి ఆటలు రాజం ముందర సాగకుండావున్నాయ్. ప్రతీ విషయంలోనూ రాజమ్, మణిని ప్రతిఘటిస్తున్నాడు. మణికి ఎంతో చిన్నతనం వేసింది. ఎందర్నో లొంగదీసిన మణికి - రాజంను లొంగదీయటం కష్ట సాధ్యంగావుంది. రాజంను మ్రింగివేయాలన్నంత కశి మణికుంది.

ఆ సాయంత్రం నది దగ్గర మణి, రాజంగురించి స్వామితో ప్రస్తావించసాగాడు. రాజంను నదిలోకి గిరవాటు వేసేందుకు తాను కృతనిశ్చయుడైయున్నట్లు మణి తేనభిప్రాయమును వెలిబుచ్చాడు. అందుకు స్వామి —

“వాళ్లనాన్నగారు పోలీసు సూపరిన్టెన్డెంటని మరచిపోయావామణి?” అని తన భయాన్ని వ్యక్తపరిచాడు.

“అయితే — నేను ఖాతరు చేస్తాననుకున్నావా? ఒక రాత్రిపోయి, నా కర్రగదతో రాజం తండ్రి భుజాలను విరగదబ్బుతాను తెలుసా?” అన్నాడు మణి.

## 3

మణికి, రాజంకు మధ్యను గూర్చుని స్వామి రాయభారిగా పనిచేస్తున్నాడు. యీ ముగ్గురూ ఆఖరు బెంచీలో పచ్చగోడకు చేరబడి కూర్చున్నారు. వీరి ముందర మాత్రం పుస్తకాలు తెరువఁబడివున్నాయ్!

మణి చిన్న కాగితం ముక్కపై - “నువ్వొక మన్ని వేనా?” అని వ్రాసి, స్వామి ద్వారా రాజమ్‌కు అందించాడు. రాజమ్ దానిని చదివి చింపి పారేశాఁడు. ఆకారణంచేత, మణి మరియొక కాగితం ముక్కపై — “దీనికి నువ్వు సమాధానం రాయకపోతే, నువ్వొక కుక్కవి!” అని వ్రాసి, రాయభారి (స్వామి) ద్వారా రాజం కందించాఁడు!

రాజం, స్వామి ముఖంలోకి కోపంగాజూస్తూ.- “వెధవా! నన్ను డిస్టర్బ్ చెయ్యకు, పాఠం విననియ్!” అన్నాడు. అంతవరకు చెపుతూన్న పాఠాన్ని మాష్టరు ఆపివేశారు.

“స్వామీ, నిలబడు! -” అన్నారు. స్వామి యెంతో వినయంగా నిలబడ్డాడు.

“‘లిస్బన్’ దేనికి ప్రాముఖ్యం వహించింది?” అని ప్రశ్నించారు.

“స్పెయినుకు ముఖ్య పట్టణం కాబోలు!” అని జంకకుండా చెప్పాడు.

జాగ్రఫీటీచరు కోపంతో పళ్లు బిగించి, బుర్రతటాయిస్తూ -

“హిందూదేశవాతావరణం గురించి నీకు తెల్సింది చెప్పు!” అని, తిరిగి ప్రశ్నించాడు.

“వేసవిలో వేడిగాను, శీతాకాలంలో శీతలంగానుంటుంది! -” అని ప్రశ్న వేసిందే తడవుగా సమాధానం చెప్పాడు.

“బెంచీ మీఁద నిలబఁడు!” వుపాధ్యాయుఁడు వొక్కమారు వురిమాడు. ఎటువంటి అభ్యంతరం చెప్పకుండా, బెంచీ మీఁద నిలుఁబడ్డాడు. బెత్తునుపయోగించకుండా, తనకిటువంటి శిక్షనిచ్చినందుకు స్వామెంతో పొంగిపోయాడు. యధాప్రకారముగా పాఠం చెప్పఁకపోతున్నాడు వుపాధ్యాయుఁడు!

స్వామినాధన్ను బెంచీపై నిలఁబెట్టినప్పటికీ — శ్రద్ధగా పాఠం వినటంలేదు. స్వామి మెదడు ప్రయాణం చేయసాగింది. బెంచీపై నిలఁబడటంచేత, క్లాసులోని విద్యార్థులందరూ నిర్దిష్టంగా కనబడుతున్నారు. ఎందరి బుర్రల్నో స్వామి చూడ కలుఁగుతున్నాడు. తనకు కనఁబడుతున్న శిరస్సులన్నింటిన్ని వాటివాటి హెచ్చుతగ్గులనుబట్టి సైజువారిగా మనస్సులో విభజించాఁడు! తను విభజించిన శిరస్సులలో - పాతిక మందికి ఎర్రటోపీలు, ముప్పై గాంధీటోపీలు లెక్కకు వచ్చాయి.

స్కూలు విడిచిపెట్టగానే ఆ ముగ్గురు తాము నిర్దేశించుకున్న స్థలాన్కి చేరుకున్నారు. మరల స్వామి వారిద్దరకు మధ్యగా నిలుఁబడి రాయభారిగా పని చేయసాగాడు. స్వామికి వారిరువురూ చాలా దగ్గరగా నిలబడ్డారు. తమతమ మనస్సులలో వున్న వుద్దేశాలను స్వామిద్వారా వొకరితో నొకరు చెప్పేందుకు నిశ్చయించారు.

మణి స్వామి వయిపుఁ దిరిఁగి. - “నీవొక మన్ని వేనా?” అని ప్రశ్నించాఁడు.

స్వామినాథన్ రాజం వయిపుఁదిరిఁగి, —

“నీ వొకమన్నివేనా?” అని మణి అన్నదే అన్నాడు.

"ఏ కుక్కలా అరుస్తూంది?" అని కనుబొమలు రాజం మీఁదకెత్తి తీవిగా ప్రశ్నించాఁడు!

స్వామినాథన్ మణి వయిపుఁదిరిఁగి.——

"ఏ 'చెత్త' కుక్కలా అరుస్తూంది? అని తాను కొంత కల్పించి అన్నాడు. జగడములకు కారణములైన యిటువంటి ఆవేశపూరితమయిన మాటలను తాను కల్పించి, వార్ని రెచ్చగొట్టాలని స్వామి వుద్దేశ్యము!

"నీ వొక మనిషివని నిరూపించుకునేందుకు నీకు శక్తి వుందా?" మణి ప్రశ్నించాఁడు. స్వామి రాజం వైపుఁ దిరిఁగి, మణి అన్నదే అన్నాఁడు!

"ఎలాగు?" రాజం అడిగాడు."

"ఎలాగు?" అని స్వామి మణి వయిపుఁదిరిగి ప్రశ్నించాఁడు!

"రేపు సాయంకాలం నల్లప్పా మామిడితోపు ద్గ్గరున్న నదిదగ్గర నన్ను కలుస్కో! -"మణన్నాడు!

"నల్లప్పా మామిడితోపు దగ్గరా?" స్వామి గట్టిగా వొకమారని తృప్తి చెందాడు.

"ఎందుకని?" రాజం ప్రశ్నించాడు.

"క్లాసులో - నాశిరస్సు బ్రద్దలుకొడతానన్నావుగా, అదేదో చూద్దామని!"

"ఓ - రెండు ముక్కలుగా కదూ" అన్నాడు రాజం వెటకారంగా నవ్వుతూ

ఇప్పుడు - స్వామినాథన్ తాలుకు సర్వీసు తీవ్రతరమైంది. ఒకరన్న మాటలను యింకొకరితో చెప్పేందుకు స్వామికి వ్యవధి చిక్కకుండావుంది!

"అయితే - నువ్వు రేపు నదిదగ్గరకు వస్తావని ఆశించవచ్చునా?" యీ మాటలు స్వామి రాజం వయిపు జూస్తూ అన్నాడు!

"తప్పకుండా!"- రాజం అన్నాడు.

మణి మాత్రం — రాజం తనతో ఎవర్నో తనకు సహాయం చేసే నిమిత్తమూ తీసుకువస్తాడేమో అని అనుమానించసాగాడు. కానీ — తనతో యెవర్నీ తీసుఁగురానని హామీయిచ్చాడు. అయినప్పటికీ-మణి గొంతు మరో సందేహాన్ని వెలిఁబుచ్చింది:

"నీకే ప్రమాదమయిన నావల్ల తటస్థించినట్లయితే, మీనాన్నగారి వల్ల నాకెటువంటి ప్రమాదము రాకుండా చేస్తానని వాగ్దానము చేయఁగలవా? -"

అలాగే అన్నట్లు రాజం తలవూపాఁడు!

## 4

వారికి కొలది సమీపములోనే నల్లప్పా మామిడి తోపుంది. సాయంత్రం 8 గంటలు కావటంచేత, ఆ దినమునకు నదికి వచ్చిన ప్రజానీకమంతా తమతమ యిండ్లను చేరుకుంది. స్వామి, మణి - యిసుక తిన్నెలపైఁ గూర్చున్నారు. వారుభయులూ, మౌనముగా వుండి, మనస్సులలో యేమేమిటో తలపోసుకుంటున్నారు! మణి చంకలో మాత్రం చిన్న కర్రగదవుంది.

స్వామి యీ విధంగా తన మనస్సులో తలపోయసాఁగాఁడు:

కొలది సేపట్లోనే — మణి, రాజం శిరస్సును తన కర్రగదతో భిన్నాభిన్నంచేసి, అతని మృతకళేబరమును నదిలోకి గిరవాటు వేసేస్తాడు; ఇది తథ్యం! అయితే యీవిషయం అతని మృతకళేబరం మల్లే మాసిపోఁగలదా? మణే, రాజమ్‌ను హత్యజేసినట్లు ఎవరికయినా ఎట్లుఁదెలుస్తుంది?

ఏదెట్లున్నా — రాజం దెయ్యంగా మారి, ఒక నాటి రాత్రి సమయమందు వచ్చి - మణిని బాధ పెట్టక మానఁడు!

తన తాత మరణించిన దగ్గరనుంచి మణి యింటిలో వొంటరిగానే పడుకుంటున్నాడు; అటువంటప్పుడే భయపడలేదు; అలాంటిది దెయ్యంగా మారనున్న రాజం వల్ల మణి బాధపడతాడంటే హుళక్కి, యిదంతా నా వెర్రి భ్రాంతి దప్పు!

ఏ దెట్లున్నా — మణి మాత్రం రాజమ్‌ను హత్య చేయకుండా, అతని కాలో-చెయ్యో విరఁగదన్ని, అతని కర్మాన విడిచిపుచ్చటం చాలా మంచిది. యీ సలహామణితో చెప్పేందుకు స్వామికి దమ్ములు లేక పోయినాయ్!

(సశేషం)

# దీక్ష

శ్రీమతి బి. సుందరీబాయి

[గోధూళి వేళ. ఆచార్య అనంతశాస్త్రి తన గృహ ప్రాంగణంలో పొగడచెట్టు క్రిందనున్న వేదికమీద ఆసీనుడై, దీర్ఘాలోచనలో నిమగ్నుడై ఉంటాడు. అతని గృహిణి కలశంతో జలందెచ్చి, అతనిధ్యానానికి భంగం కలిగించడం యిష్టంలేక, అర్ధనిమీలిత నేత్రాలతో అతనివైపు చూస్తూ ఉండిపోతుంది. కొంతసేపయాక.]

సరళ:-(భర్తనుద్దేశించి మెల్లిగా దగ్గింది)

అనంతశాస్త్రి:-(ఉలికిపడి, దృష్టి అటు మళ్లించి) నువ్వా, సరళా!

స:-అవునండీ. ప్రదోషవేళైంది.

అ:-ఎంత సేపయింది నువ్వువచ్చి?

స:-ఇంతకుముందే వచ్చాను.

అ:-మరి, నన్ను పిలవలేదేం?

స:-ఎన్నడూలేనిది, యివ్వాళ ప్రదోష వేళైనా, సంధ్యావందనానికి యింకా లేవలేదేమా అని ఆలోచిస్తూ నిలబడి పోయాను.

అ:-ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. ఆఁ. తీర్థమేదీ?

స:-యిదిగో - అవునుకాని, దేన్ని గురించి అంత ఏకాగ్రతగా ఆలోచిస్తున్నారండీ?

అ:-ఆఁ, ఏమీలేదు.

స:-అంత దీర్ఘాలోచనకు ఏదో కారణం లేక పోతుందా, దాస్తున్నారుకాని.

అ:-(నవ్వి) అర్ధాంగికి తెలియకూడని విషయాలుంటాయా, సరళా! అందులో నాకా?

స:-ఏమో! పురుషులు అర్ధాంగి అయితే మాత్రం, అన్నీ చెబుతారా యేం?

అ:-అపోహపడకు, వెర్రిదానా?

స:-భోజనాలయాక, సావకాశంగా మాట్లాడుకోవచ్చునుగాని, ముందు లేవండి.

అ:-మామగారేం చేస్తున్నారు?

స:-దొడ్లో కూర్చుని, హరినామస్మరణ చేసుకుంటున్నారు.

అ:-నిగమశర్మో?

స:-మధూకరానికి బయలుదేరే ప్రయత్నంలో ఉన్నాడు.

అ:-పిచ్చివాడు! నియమబద్ధమై జీవితం గడపాలంటాడు. అది సాధ్యమౌతుందా యీ కాలంలో!

స:-పట్టుదల ఉంటే సాధ్యంకాని పనులుండవని మీరేకాదూ ఉపదేశించారు? నిగమశర్మ మీప్రియ శిష్యుడేగా.

అ:-అతడుకూడా ఒక గురువు కాబోతున్నాడు సరళా! వచ్చే పౌర్ణమావాస్య నాటికి అతని విద్యార్థి దశ పూర్తవుతుంది. తెలుసునా?

స:-యికనేం! మీ ఆచార్య స్థానం అతనికి యివ్వండి.

అ:-ఏమో, ఇవ్వవలసి వస్తుందేమో, ఎవరు చెప్పగలరు ?

స:-(నవ్వి) మాటల్లో పడి కాలాన్ని మరచి పోవడం మీకేనాడు కొత్తకనకనా ? యిక లేవండి, నేను వెళ్లి వంటింట్లో పనులు చూసుకోవాలి. (వెళుతుంది)

అ:-(దీర్ఘనిట్టూర్పువిడిచి) అమాయకురాలు కాలగర్భంలోని విషయాలను తెలుసుకోలేనిమనుగ !

*

## రెండవరంగం

[ఆదేరాత్రి - అష్టమ వెన్నెలలో ఆరుబయటున్న కూర్చుని, అనంతశాస్త్రి, సరళమాట్లాడుతూంటారు. సరళ మాటల్లో దైన్యం, అనంతుని మాటల్లో నిశ్చలత్వం గోచరమవుతూంటాయి.]

సరళ:-ప్రభూ, మనవియోగం అంత అనివార్యమా ?

అనంతశాస్త్రి:-అవును సరళా ! ధర్మ ప్రబోధంకోసం నేను యతిని కావలసిందే.

స:-మనవైవాహిక జీవితం మీ ధర్మ ప్రచారానికి అడ్డురానప్పుడు మీరు —

అ:-అంతదూరం నేనూ ఆలోచింపకపోలేదు. కాని, గృహస్థాశ్రమంలోఉండి యతి నియమాలను పాటించడం అసంగతం.

స:-యతులేకాని, గృహస్థులు ధర్మప్రచారానికి పనికిరారా స్వామీ ?

అ:-పనికిరారనికాదు. స్త్రీ సమీపవర్తిని అయి ఉన్నంతకాలం పురుషుని నిశ్చలత అనుమానాస్పదం. అందులో మనబోటి యవ్వన ప్రాయుల విషయంలో అసంభవం.

స:-ప్రభూ, మీవంటి స్థిరచిత్తులకుకూడా అసంభవమైన విషయాలున్నాయంటే నేను నమ్మలేకుండా ఉన్నాను.

అ:-నేనూ మానవుణ్ణే. తెలియకచేసిన తప్పుకంటె తెలిసిచేసినతప్పు గొప్పది.

స:-అయితే, మీలక్ష్య సిద్ధికోసం మన వైవాహిక జీవితాన్ని త్యాగం చెయ్య దలచుకున్నారన్నమాట !

అ:-అవును. త్యాగంలేనిదే ఏమహాకార్యం నెరవేరదు. ఆ మహాకార్య నిర్వహణకోసం నువ్వుకూడా త్యాగంచేయాలి సరళా !

స:-ఇంతవరకుజరిగిన ధర్మప్రబోధం చాలదా ప్రభూ! అవతారమూర్తులయిన శంకరాచార్యాదులుచేసిన ప్రబోధం వాడవాడలా యింకా వినిపిస్తోనే ఉందే !

అ:-కావచ్చు సరళా! అయినా, యీనాడు సంఘంలో నాస్తికత ప్రబలిపోతోంది. మానవుడు దేవుణ్ణే విస్మరిస్తున్నాడు. సృష్టిస్థితి, లయలు తన ప్రతాపమే అని గర్విస్తున్నాడుకాని, వీటికి ఆధారభూతమైనది అవ్యక్తశక్తి ఒకటి ఉందని, అదే భగవత్స్వరూపమని తెలుసుకోవడంలేదు. అట్టి మానవజాతి కనువిప్పుకోసం మధ్యమధ్య ప్రబోధం అవ

సరం. నన్ను కార్యవిముఖుణ్ణిచేయ ప్రయత్నించకు సరళా!

స:-నాన్నకు ఈ మాట తెలిస్తే, ఆయన ముసలిగుండె ఎంత క్షోభిస్తుందో ఊహించావా?

అ:-ఆ క్షోభ తాత్కాలికమే. ఆయన మాత్రమేం అజ్ఞానుడా? ఒకవేళ అధైర్యపడినా నువ్వు ఊరడించలేవా, వెర్రిదానా?

స:-ఏమని ఊరడించను ప్రభూ! నాదైవము నన్ను పరిత్యజించి వెళ్లిపోయారనా? అల్లుని సన్యాసాశ్రమ స్వీకారం మామకు ఆనందదాయకమా?

అ:-ఆనందదాయకమే కాదు, సరళా! గర్వకారణంకూడాను. నీ భర్త మతోద్ధారకుడని లోకం కీర్తిస్తూంటే నీ శరీరం ఉప్పొంగదూ! నిజమైన ఆనందం అప్పుడేగా కలిగేది?

స:-ప్రభూ, స్త్రీ చిత్తం అతిదుర్బలమైనది. సాంసారిక జీవితాన్నే కోరుతుందికాని-

అ:-మరచిపోయావా పూర్వగాథలు సరళా! ఎంతమంది పతివ్రతలు ఎంతలేసి త్యాగాలు చెయ్యలేదు?

స:-వారు దైవాంశ సంభూతులు, నేనొక-

అ:-దేవత్వం మన మనస్సంకల్పాన్ని బట్టి వస్తుంది సరళా! లోక కళ్యాణంకోసం చేసిన త్యాగం నిశ్చలమైంది. అందులో స్వార్థంలేదు.

స:-కాని, రేపు యీ గర్భస్థ శిశువు తన జన్మదాత ఎవరంటే, ఏమని జవాబు చెప్పను ప్రభూ!

అ:-భేదానందస్వాములని చెప్పు సరళా! భయమెందుకూ?

స: (తుళ్లిపడి) ఆఁ! అప్పుడే నామకరణం కూడా-

అ:-అంతేకాదు. గురుదేవుల అనుజ్ఞకూడా అయింది. యిక అర్ధాంగి అయిన నీ అనుజ్ఞమాత్రమే తరువాయి. ఆనాడు కాని, నాకు సన్యాసాశ్రమ స్వీకారానికి సంపూర్ణార్హత రాదు. మనఃపూర్వకమైన అంగీకారాన్నియియ్యి, సరళా!

స: తన వ్రేలితో తనకన్నే పొడుచుకునే నిర్భాగ్యురాలుంటుందా ప్రభూ, లోకంలో.

అ:-సంఘశ్రేయస్సుకోసం అవసరమైతే, కన్నేకాదు, హృదయాన్నే పొడుచుకోవలసివచ్చినా, నవ్వుతూ కర్తవ్యాన్ని నిర్వహించవలసిందే. అదే సరైన త్యాగం. విజ్ఞానవంతురాలివి. నీకు నేను చెప్పాలా, సరళా!

స:-(అతికష్టంగా) సరే, కానివ్వండి. మీ ఆజ్ఞనే శిరసావహిస్తాను. కాని, ఒక్క కోరిక.

అ:-చెప్పు, సరళా, నా నిశ్చయానికి అడ్డు రానంతవరకూ ఏకోర్కైనా తీరుస్తాను.

స:- (ఏడుస్తూ) మీ వంశాంకురానికి

ద్వాదశవర్ష ప్రాయంలో మీ పాదాలను అనుసరించడానికి అనుజ్ఞ యివ్వండి.

అ:-'లోకాలః లోధర్మః' ఆ నాటిమాట యీనాడెందుకు? పరిస్థితులనుబట్టి, నీ భవిష్యత్తును నువ్వే నిర్ణయించుకో. వృద్ధులైన మామగారిమాట మాత్రం మరచిపోకు. ఆప్తులకు మనః క్లేశం కలిగించవద్దనిమాత్రం ఆదేశిస్తున్నాను.

స:-చిత్తం. యిక ఎనిమిదిరాత్రులే కాబోలు మనగార్హస్త్యజీవితం ... తలుచుకుంటే హృదయం బద్దలైపోతోంది ప్రభూ!

అ:-ధైర్యంవహించు సరళా. దుఃఖించి ప్రయోజనంలేదు. మనవంశాంకురం కోసమైనా నువ్వు ధైర్యం అవలంబించాలి. లేకపోతే ఆ జీవికి పిరికితనం అంటుతుంది. అది జ్ఞాపకముంచుకో.

స:-మీ ఆజ్ఞ.

అ:-నానిష్క్రమణవరకూ యీ విషయాన్ని రహస్యంగా ఉంచాలి. తెలిసిందా!

స:-(వెక్కుతూ) చిత్తం.

అ:-సరళా, నిన్ను భార్యగా పొందినందుకు నా జీవితం ధన్యమైంది. ఏదీ ఒక ....

మూడవరంగం

[పౌర్ణమినాటిరాత్రి - గురుశిష్యులైన అనంతశాస్త్రి, నిగమశర్మలు పాఠశాల ప్రాంగణంలో మాట్లాడుతూంటారు.]

అనంతశాస్త్రి:-అయితే, నిగమశర్మా!

నిగమశర్మ:-ఆజ్ఞ యివ్వండి గురుదేవా!

అ:-నేటితో నీ విద్య పరిపూర్తయిందికదూ!

ని:-విద్యకు పరిపూర్ణత్వం ఎక్కడిదిస్వామీ! సమగ్రమైన విద్వత్తును పొందడానికి మానవుని పూర్ణాయుర్దాయమే చాలదని మీరేగా శలవిచ్చారు!

అ:-(విషాదంగానవ్వి) నా పాఠాన్ని తిరిగి నాకే వప్పగిస్తున్నావా?

ని: క్షమించండి. మీరేదో నన్ను విద్వాంసుణ్ణిగా పరిగణిస్తోంటే అడ్డువచ్చాను.

అ:-రేపు సూర్యోదయాత్తు ఈ పాఠశాలకు నిన్ను ఆచార్యునిగా భావిస్తే!

ని:-ఆత్మహత్య చేసుకుంటాను.

అ:-ఆత్మహత్య మహాపాతకమేమో?

ని:-గురుదేవుల పవిత్రాసనం మీద కూర్చుని, వారి ఆచార్యపదవిని నిర్వహించ ప్రయత్నించడంకన్న మహాపాతకమా స్వామీ?

అ:-గురువు ఆదేశంమీదే అయితే దోషం లేదు, నిగమా!

ని:-అయితే గురుదేవుల ఆజ్ఞ అంత అధర్మంగా ఉంటుందా స్వామీ!

అ:-అవును, శర్మా! నేను ఆదేశిస్తున్నాను. రేపు సూర్యోదయంనుండి నువ్వే ఈ పాఠశాలకు ఆచార్యుడివి.

(సశేషము)

# శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారి సంగ్రహ జీవితం



శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ నవకాలమున సవయస్కవనితలం దసదృశ ప్రతిభాశాలిని. ఉత్తమ గృహిణిగా, సారస్వతవ్రతగా, సభాచతురగా పెద్దల యాశీస్సు లందుకొనుచున్నది. పిన్నల ప్రశంసల పొందుచున్నది. లక్ష్మీకాంతమ్మ పింగళవత్సరమున (25-12-1917) శ్రీ నాళం కృష్ణారావు శ్రీ సుశీల దంపతుల కళారాధనా ఫలముగా జననమందినది. శ్రీ వేంకట కృష్ణయ్య యను చిననాటి నామశోభితులయిన కృష్ణారావుగారు జన్మమధురమయిన మధురకవి. శ్రీ వేంకటసుబ్బమ్మయని నాటివారి పిలుపులలో మెలగిన శ్రీ సుశీలమ్మగారు ఆవరణముగా పరిణత స్నేహసారయై కళారాధికయయినది. వారి భద్రంకరమయిన సుమానుషము లక్ష్మీకాంతమ్మ సముదయాభ్యుదయములకు హేతువగుట శ్రీలక్ష్మీకాంతమ్మయను ఋణము సంభావించును. ఒకప్పుడు సూఫీఫకీరు ద్విగ్నుడయినాడని శాంతమ్మృదుల హృదయయయిన సుశీలమ్మ నాగప్రతిష్ఠా వైభవము నిర్వహించినది. లక్ష్మీకాంతమ్మ యన్నగారు శ్రీనాగేశ్వరరావు, కుశల ప్రజ్ఞుడు. ఆనర్సు పరీక్షా సముత్తీర్ణుడు. తమ్ముడు కామేశ్వరరావు కళాప్రియం భావుకుడు.

లక్ష్మీకాంతమ్మ పసితనమున నుగ్గుబాలతో సారస్వత రసము ద్రావినది. వీధిబడిలో విద్యారంభ మొనర్చినది. వైశ్యసేవాసదనము యువతీ సంస్కృత కళాశాలలో విద్యాస్నాతయయినది. సదన విద్యా ప్రశస్తికి కాంతమ్మ పర్యాప్తమయిన సాక్ష్యము. అచటనే యపేక్షితమయినంత యాంగ్లము నేర్చినది. సంస్కృత భారతీ సంస్కృత యయినది. తెలుగు పలుకుల తెలివి తెలిసికొనినది. ఆంధ్రవిశ్వ విద్యాలయము నియతి ననుసరించి ఉభయభాషా ప్రవీణ పరీక్షలో 1935 వత్సరము సర్వప్రథముగా (Ist-క్లాసు) సముత్తీర్ణత పొంది సదనమునకు సంపత్తునకు సంభావనా సంపత్తు నిచ్చినది. శ్రీ యల్లాప్రగడ జగన్నాథము పంతులు గారు కొంతమట్టుకు రామకృష్ణబోధలు నేర్పిరి. అరవింద భావములు బోధపఱచిరి. రమణర్షి రమ్యవచనలు దోబ్ధించిరి. యోగాసక్తి నుత్పాదించిరి. ఆధ్యాత్మిక జీవనరమ్యత నవగతము చేసిరి. పితరుల శ్రద్ధాసక్తులబట్టి లక్ష్మీకాంతమ్మకు బ్రహ్మసమాజ సాధనము లందభిరుచి యున్నది. ఏకేశ్వర ప్రార్థనా గోష్ఠిలో నపుడపుడామె పాలుపుచ్చుకొనినది. నైమిత్తిక గోష్ఠిలోన నిమిత్తముగానే యభిమానవతియయినది. సాయం ప్రాతర్వేళలందు పెద్దలకన్న శ్రద్ధగా గోష్ఠీ విశేషములరసినది. సటీకముగా భగవద్గీత భజించినది. సాభిప్రాయముగా నౌపనిషదార్థము భావించినది. పరిసరప్రభావములకు కాంతమ్మ చిన్ననాటినుండియు లొంగి యుండలేదు. లక్ష్మీకాంతమ్మకు ప్రతీకోపాసనమభీష్టమయినది. ఇంతటి విజ్ఞత యట్టి యారాధ్యమారాధింపజేయుట కాంతమ్మ విషయమున తథ్యమయినది. లక్ష్మీకాంతమ్మ కృష్ణకుమారి. కృష్ణకుమారిగా తన పేరనేక పర్యాయములు ముద్రితమగుట కాంతమ్మ కానందమయినది. కృష్ణకుమారి, లక్ష్మీకాంతమ్మ తన పదమూడవయేట (24-3-1930) శ్రీ ఊట్కూరి హయగ్రీవగుప్త కర్ధాంగ లక్ష్మియయినది. 10-10-1908 వత్సరమున శ్రీహయగ్రీవగుప్త ఊటుకూరి వంశగౌరవహేతువు రామయ్యగారి కుమారుడు శ్రీ వేంకటేశ్వర

శ్రేష్ఠి శ్రేష్ఠులు పితృపాదులుగా, శ్రీ రంగమాంబ మాతృదేవతగా జననమందెను. హయగ్రీవ పితరులకు సంస్కృతాత్మయన్నది. సంస్కృతభాషాసక్తి వారి కధికము. వేదపాఠశాల పెట్టించిరి. సంస్కృతశాల నేర్పాటు చేయించిరి. వివాహసమయము నాటికి కృష్ణకుమారి లక్ష్మీకాంతమ్మ సంస్కృతాధీతిని. పెండ్లిపేరుగా పెండ్లికూతురు కానున్న కన్యలకు విద్యాప్రతిరోధము కూర్చువారలను హయగ్రీవ పితరులెన్నడును హర్షింప లేదు. కృతాత్ములయినవారు కాంతమ్మ సంస్కృత సంస్కృతి సంస్కృతయగుట నభినందించిరి. అట్టి యచ్చ నుజ్ఞనిచ్చిరి. ఈ యవకాశ ప్రదానము నిదానముగా కాంతమ్మ యిట్టి ప్రశస్త విద్య యయినది. పుట్టినింట నాటల పాటల సాటిలేని మేటియగుట కుదురవచ్చును. కాని మెట్టినింట సాహితీ తపస్య కాంతమ్మ కనంతరాయముగ కుదురుటలో పతిదేవుడయిన శ్రీ హయగ్రీవగుప్త సర్వమూలము. శ్రీ లక్ష్మీకాంతమ్మ శ్రీ హయగ్రీవగుప్త భాగ్యలక్ష్మి. శ్రీ హయగ్రీవగుప్త శ్రీ లక్ష్మీకాంతమ్మా వీరివస్యాఫలము. హయగ్రీవు డాంగ్ల భాషా పట్టభద్రుడు; న్యాయవాది, ధార్మిక వాక్కీలుడు, కళాతపస్వి, నిత్యనైమిత్తిక కర్మాసక్తుడు, సారస్వతవ్రతి, కళాహృదయుడు. లక్ష్మీకాంతమ్మ తొమ్మిదవ యేటనుండి పదునెనిమిది వత్సరము 'లభ్యసించిన వీణావాదనము, త్యాగరాజస్వామి కృతి ప్రియత్వమున నేర్చిన సంగీతవిద్య సాహిత్యవాసితములై గుప్తమోద ప్రమోదము లావిష్కరించినవి.

లక్ష్మీకాంతమ్మ ఉభయభాషా ప్రవీణ, అయినను తనకు సంస్కృతభాషపైకన్న తెలుగుభాషపై యాదరమధికమని వాకొనును. వచోవిన్యాసమున విషయ వ్యాఖ్యానమున కొంతమట్టుకు సంస్కృతాదర మన్యూనముగ నున్నట్లు గోచరించును. ఆంగ్లమున పరిచయమున్నను కాంతమ్మ యట్లు కన్పడని యబల. మానవ వ్యక్తులకాజన్మసిద్ధములయిన యభిరుచులు వారి భావదర్పణములుగా నుండును. కాంతమ్మ యాహారమును కాంతము. ప్రకృతి వైద్య విధాన మామె కభీష్టము. శుచిగా, రుచిగా సిద్ధముచేసిన కాయగూరలు కాంతమ్మ యాహారమున ముఖ్యములగును. గోదావరీతీరజ యయిన నావకాయఘాటు సైపదు. భావపురీభావిత యయినను కొరివికారమంటదు. ఒకప్పుడొకింతరుగ్ణ కాగా మిరియాల కషాయము పుచ్చుకొనక తప్పదని కాంతాభిమానలనిరి. తప్పనిసరియై కాంతమ్మ యాకషాయమును కరముతో పుచ్చుకొనినది. నలుగురెంతో యెంతో పట్టు పట్టినగాని త్రాగలేదు. ఇక మరి యామె కషాయము త్రాగలేదు. కాంతమ్మ కషాయితకాదు. కషాయముత్రావి యామె యుక్కిరిబిక్కిరి తనమెట్లు సహింపగలదు? పాలబుగ్గల పసితనమున నేమో కాని కాంతమ్మ యాముదమునయిన నొకప్పుడే త్రాగినది. లక్ష్మీకాంతమ్మ యాహారమున నిట్లు సాత్వికభావ. కాని కాంతమ్మ చురుక్కున కోపనకాగలదు. అయిననేమి? అది సులభకోపము. చిరమట్టిది యుండదు. కాంతమ్మ కోపము వెంటనే తగ్గును. తన కోపవృత్తి పొరపాటని యామె గుర్తించును. నాలుక కొనకి కొనదుకాని మనసు మలచుకొనును. ఇట్లెందరు చేయగలరు? కాంతమ్మ చేయలేనివి కొన్నికలవు. ఆమె యితరులను వెక్కిరింపలేదు. తన నట్లుచేసిన సహింపలేదు. ఇతరుల ఇతరుల నభినందింపక లేకపోలేదు. లక్ష్మీకాంతమ్మ మొదట విష్వక్సేనగోత్ర. పిమ్మట సుకాంచనగోత్ర. కన్యాత్వమున నుద్రేకముతో భజనలు చేసినది. ఇప్పుడు శాంత ప్రసన్నభావమున దేవి నుపాసించును. ద్వైతమామె భావద్వైతమున హేతువు.

కరుణాతరంగితాక్షి యరుణారుణచరణదేవి యరుణవసనధారిణియని కాంతమ్మ గుర్తించినది. బాలారుణవసనములు కాంతమ్మ కిష్టము. సురూప సుగంధ కుసుమము గులాబి కాంతమ్మ కభీష్టము. మల్లెజాజులు

వల్లెయనును. ఆణిముత్తెముల సరులు పొత్తుకొనును. కళాదేవత నుపాసించును. నాట్యమభ్యసించినది. అంతకన్న నాట్యవిద్యాభిలాష యామె కధికమయినది. అవును! ఆమె సాహితీ బలముకలిగిన యబల. చిత్రకళ నేర్చినది, ముగ్గులు తీర్చినది, క్రొత్తముగ్గు లూహించి నేర్చినది. కుట్టుపని యలవరచుకొనినది. ఇంతయున్న నామెకు కుట్రతనము కుదురలేదు. అనూచానముగావచ్చు సంప్రదాయ ధర్మములను లక్ష్మీకాంతమ్మ గుర్తించినది. అభీష్టముల ననుసరించినది. కాని యామె చిత్తము సంప్రదాయ గ్రహీతము కాదు. బౌద్ధమన్నప్రీతి. బుద్ధుని జీవితముపై నాదరము ఆమెకుకలదు. భారతీయములయినను కాకపోయినను ఆధ్యాత్మిక సాధనము లెటనున్న నామె యభిమానింపగలదు. వానికి వీనికి సమన్వయము సంధానింప వలెనని యామె తలచును.

సంస్కృతమున కాంతమ్మ మాటలాడగలదు. నెమ్మదిగా నుపన్యసింపగలదు. ఇటుపైనాంధ్రములో వలెనే యుపన్యసించును. సంస్కృత భాషలో నున్న దిఙ్నాగాచార్యుని కుందమాల నాటకమామె కభిమాన పాత్రము. ఆతడు బౌద్ధుడై యిట్లు నిర్దేశించుటనా? సీతలోని సీతాత్వముతో సమముగా స్త్రీత్వము నందుల్లసించి నందుననా? ఆణెముత్తెముల్లట్లు తెలుగు పలుకుల వెలుగుల పోహళించినందుననేమో తిక్కన సోమయాజి కవిత కాంతమ్మకు కాంతము. సౌందరనందము రచించిన పింగళి కాటూరుల కవితాభిమానినియై యాపలుకుల మేనితనము తాననుసరించినది. కందపద్యరచన మభీష్టమయినను కాంతమ్మ గీతాభిలాషకలది. గాన సభలలో ప్రశంసా పద్యములు చెప్పినది. వివాహవేదికల కవితాశీస్సుల పలికినది. వివిధచ్ఛందోరచనాసక్త సీసము గీతము లధికముగా కూర్చినది. స్వీయకవిత పేరున తన పరమహంస కావ్యము నుండి కొన్నిటిని లక్ష్మీకాంతమ్మ విజయవాడ రేడియో కేంద్రమున ప్రసారముచేసినది. మదరాసు విజయవాడ రేడియో కేంద్రములనుండి యనేక పర్యాయములు తన రచనలనీయమ ప్రసారముచేసినది. శాకుంతలము- ఉత్తరరామచరితము – భర్తృహరి – గీత గోవిందము మొదలగు రేడియో రచనలు ప్రసిద్ధములు. రేడియో కార్య క్రమములందు కవయిత్రిగోష్ఠి నేర్పాటుచేయుట నీమె నచ్చచెప్పినది.

శ్రీ లక్ష్మీకాంతమ్మకు నటనము తెలియదు. ఆమె నర్తన మెఱుంగును. విద్యాభ్యాస సమయమున నాటక ప్రదర్శనములందు పురుషవేష ధారణముచేసి ఒకప్పుడు కణ్వుడుగా, మరొకప్పుడు దుష్యంతుడుగా, ప్రహ్లాదుడుగా, అర్జునుడుగా నటించినది. అంతియకాదు. కాంతమ్మ సహజముగా ప్రియంవద. శాకుంతలమున ప్రియంవదా వేషము ధరించి నటించినది. లక్ష్మీకాంతమ్మ తెలుగునాట నానాసభలందు గంభీరముగా నుపన్యసింప నేర్పుగలది. పలికినట్లు వ్రాయగలదు. వ్రాసినట్లు పలుకగలదు. "తిక్కన ద్రౌపది, నాచన సోముడు, రాయలనాటి రసభావవస్తు విచారణము, పెద్దన, పింగళిసూరన, వ్యాసుడు, తిక్కన, నన్నయ, పోతన, నిశాకాంత మొదలగు విషయములపై నీమె వ్యాసముల రచించి పత్రికల ప్రచురింప జేసినది. ఉభయ భాషా ప్రవీణ. విశ్వవిద్యాలయ మిచ్చిన సాధికార బిరుదము. శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, దువ్వూరి వెంకటరమణశాస్త్రి మొదలగు నవకాలపు కవులభినందించి యాశీః పురస్సరముగా నిచ్చిన – విద్వత్కవయిత్రి, ఆంధ్ర విదుషీ కుమారి, తెలుగు మొలక, ఆంధ్ర సరస్వతి, కవయిత్రీతిలక – మొదలగు బిరుదములుగలవు. జంషెడ్పూరు, బొంబాయి, ఖరగ్పూరులలో

రాష్ట్రేతరాంధ్రుల సభల మెప్పించినది. ఆంధ్ర సాంస్కృతిక పర్యటనమున ఆంధ్రశక్తి యుక్తులను చాటి చెప్పినది. గృహలక్ష్మి, భారతి, ప్రబుద్ధాంధ్ర, ఆంధ్రమహిళ, కృష్ణాపత్రిక, నవోదయ మొదలయిన పత్రికలలో ప్రచురితములయిన కాంతమ్మ వ్యాసములను సంకలనము చేయుట యుక్తము. మదరాసు మహిళాభ్యుదయ ప్రణాళిక గుర్తించి స్త్రీ వాఙ్మయ సమీక్ష చేసినది. గురుజాడ వర్ధంతి సభల పాల్గొనినది. వీరేశలింగము వర్ధంతి సభల నిర్వహించినది. రాజకీయ సభాచర్చల పాల్గొనినది. ఆంధ్రరాష్ట్ర సభాచర్చల రాణింపజేసినది. గృహప్రాంగణమున సభారంగమున శిష్టవ్యావహారికభాష నభినందించుటయుకాక గ్రంథములందును వ్యావహారికభాషకు సముచితస్థాన మవశ్యముండి తీరవలెనని లక్ష్మీకాంతమ్మ తలచును. ప్రత్యేక ప్రత్యేకముగా నాయావిషయములందభినివిష్ట లనేకు లుందురు. అన్నిట సమరసప్రజ్ఞ లరుదు. లక్ష్మీకాంతమ్మ సదృశ లాంధ్రలో కొందరు మాత్రముందురు. అంద రట్టివారు కావలెయనుట కాంతమ్మకును కాంక్షితము.

ఒక్కొకరి జీవితమునకొక్క పరిపాకముండును. అట్టి పరిపాకమున కాధార లనంతములుండును. కొన్ని స్వప్నసమకాల విశేషములు జీవిత సమన్వయముపొంది చిత్రముగ భాసించును. లక్ష్మీకాంతమ్మకు స్వప్నములన్న నొకప్పటినుండి దృఢవిశ్వాసముదయించినది. ఆమె స్వప్నకథలకును జీవిత విశేషములకును పరస్పర సంబంధమున్నది. సూర్యునిలో మంటలు, మహాజలప్రవాహము, లోకాందోళనము, క్రొత్త చంద్రుడు, రోహిణి చంద్రునిలో ప్రవేశించుట, పర్వతారోహణము, దిగుడుబావి, శక్తిపిలుపు, నిధుల వశీకృతి, కాలరాక్షసులు, సముద్రఘోషలు, ప్రళయములు, మారుటలు, తెల్లని కృష్ణులు, ఆకాశములోని పద్మములు, చిత్రవిచిత్ర జ్యోతిః ప్రవేశములు, మంత్రజపములు, పుస్తకము లందుకొనుటయు మొదలగునవి స్వప్నవీథులందు నెదురు చెదురుగా నెందరికేని గోచరించును. లక్ష్మీకాంతమ్మకు నిట్టివి స్వప్నభాసములు కావచ్చును. స్వప్నతాత లిట్టి వానిని వ్యర్థములనరు. లక్ష్మీకాంతమ్మకే స్వప్నమున నెట్టి విశేషము భూతమయినదో లోకము తెలియుట కవకాశముండదు. కాని స్వప్నచరితము లందాత్మ చరిత సమన్వయము చూచుకొను నొక పవిత్ర చరిత చరిత మభినందనీయము. శ్రీ లక్ష్మీకాంతమ్మ సంతానవతి. తన పిల్లలకు తనకువలె తన భర్తకువలె కళాప్రియం భావుక కలుగుట కుగ్గుపాలతో మధురశిక్షణమిచ్చును. వారందరు కాంతమ్మ కన్నులజూచి యాజ్ఞలు తెలిసికొందురు. పలుకుల విని బోధలు పొందుదురు. సుహాసిని ప్రతాప చంద్రుడు రాజరాజ నరేంద్రుడు, విజ్ఞానేశ్వర కుమారుడు, సంస్కృతము, తెలుగు, హింది, ఆంగ్లము నేర్చుచున్నారు. వీణ పలికించుచున్నారు. తల్లి పలుకులు వినుచున్నారు. చంటివాడుమాత్ర మప్పుడప్పుడు కోపించును. వానికి కోపము వచ్చెనా! తల్లిపై కవిత్వము చెప్పును. వానికన్న పెద్దవారదివిని సంచాలింతురు. వారి యిల్లు కళానిలయము; న్యాయనికేతనము; సారస్వత క్షేత్రము. ధర్మభూమి. ఇంటికెవరేని వచ్చిన వెంటనే శ్రీహయగ్రీవగుప్త స్వాగత మిచ్చును. కాంతమ్మను పిలుచును. అందరుపవిష్టులై ఇష్ట సల్లాపముచేయుదురు. ఇట్టి భాగ్యము సాధారణముగ నున్నది. లోకమంతట నిట్టిరీతి గృహలక్ష్మినీతి.

జమ్ములమడక మాధవరాయశర్మ

# మాతృదేవి ఆనందమాయి

ఆంగ్లమూలం :
శ్రీ కె. కె. మీనన్, బి.ఎ., బి.యల్.

అనువాదం :
కుమారి కె. వసంత

(గతసంచిక తరువాయి)

మరుసటిరోజు సాయంత్రము నాభార్య మాతాజీని దర్శించెను. ఆమెకు సాష్టాంగ నమస్కారమును గావించెను. మాతాజీ ఆమెనుచూచి నవ్వెను. తాలయార్ఖాను భార్య ఆమెను "భజనలకు రాకుండుటకు కారణము ఏమి" అడిగెను. ఆమె తన కూతురికి వ్యాధి ఎక్కువగ నుండుటచేత, ఎవరైనా ఒకరు ఆమెదగ్గర ఉండవలయునని సమాధానమిచ్చెను. తాలయార్ఖాను సతీమణి మాతాజీకి ఆమాటలను హిందీలో చెప్పెను. మాతాజీ చిఱునవ్వుతో "అచ్ఛా" అని పలికెను. తాలయార్ఖాను భార్య నాభార్యతో "నీభర్తగారు మాతో ఎంతో మంచిగా నడుచుకొనిరి, అందుకు మాతాజీ ఎంతో ఆనందము నొందుచున్నారు. నీబిడ్డను గురించి దిగులుపడకు. రేపటికి తనవ్యాధి యంతయు పోవును. రేపు సాయంత్రము నాలుగుగంటల తరువాత నీకూతురుని తెచ్చి మాతాజీ పాదములపై నుంచుము' అని చెప్పెను. ఆమె మాతాజీకి బహూకరించిన రోజాపూలదండ నుండి తాలయార్ఖాను భార్య రెండు రోజా దళములను తీసి నాభార్యతో "నీకూతురితో ఈదళములను తినమని చెప్పుము" అని చెప్పి ఇచ్చెను. ఆమెచెప్పిన ప్రకారము మేముచేసితిమి. మరుసటిరోజు జ్వరము అలాగే ఎక్కువగా నుండెను. వైద్యుడువచ్చి పరిశోధించెను. అతడు పరిశోధనకై కొంచము రక్తమును తీసికొనెను. వైద్యుడు "వెర్రి" అని చెప్పునను భయముచే నేను నామనస్సుననుండు అభిలాషను తెలియజేయుటకు అధైర్య పడితిని కాని పిల్లను మాతాజీ యొద్దకు తీసుకొని వెళ్లమని నాలో నేదో చెప్పుచున్నట్లనిపించెను. నాలుగుగంటల కింకొకసారి జ్వర మెంతున్నదో కనుగొని తర్వాత ఏమి చెయ్యాలో నిశ్చయింప వచ్చునని తలంచితిని. సరిగ్గా నాలుగు గంటలకు ధర్మామీటరును పెట్టి చూడగా జ్వరములేదు. నాకండ్లను నేనే నమ్మలేక పదినిముసముల వరకు ధర్మామీటరును చూస్తూ స్తంభితుడనై నిలుచుంటిని. తత్క్షణమే వైద్యుని అనుమతితో బిడ్డను ఎత్తుకొని మాతాజీ చెంతకు వెళ్ళి, పిల్లయేకాక, అందరము పవిత్రమైన మాతాజీ పాదములపైనను, మా 'కండ్లను తెరచిన' తాలయార్ఖాను భార్య పాదములపైనను పడితిమి. ఆమె దివ్యమైన హస్తములు పనిచేయు నిదర్శనము లింకను ఎన్నియో నాకు తెలియును. కొంత కాలమునకు ఒకనాడు సాయంత్రము తాల

యార్కను భార్య నాతో, ఆరోజు రాత్రి కన్యాకుమారికి వెళ్లుటకు కారొకటి ఏర్పాటు చేయవలసినదిగా అడిగెను. నేను క్షేత్రమునుండి వెళ్లుటకు పూర్వమే గుడికి తలవని తలంపుగా బోర్డు ఆఫ్ ట్రస్టీసుకు అగ్రాసనాధిపతి కే. ఎమ్. ఎస్. లక్ష్మణ అయ్యరు ఏతెంచెను. అతను ఆనందముగా తనకారును ఇచ్చుటకు సమ్మతించెను. ఆదినము సాయంత్రమే మాతాజీ శిష్యుడొకడు, మాతాజీయొక్క చిన్న ఫోటో నొకదానిని నాకు ప్రసాదించెను. అందులో మాతాజీ పసిపాపవలె నవ్వుచుండెను. ఆఫోటో దొరికినందుకు నేనెంతో ఆనంద భరితుడనైతిని. కాని నాభార్య అపుడు "నేను మొట్ట మొదటగా మాతాజీని దర్శించినపుడు ఆమె ఎట్లు మందహాసముతో ఆశీర్వదించు భావముతోనుండెనో అటువంటి ఫోటో దొరికిన ఇంకను ఎంతో సంతోషించియుండెదను'' అని చెప్పెను. మరుసటి రోజు నాస్నేహితు డొకడు మాతాజీ యొక్క పెద్ద ఫోటో నొకదానిని తెచ్చి ఇట్లు చెప్పెను. "ఈఫోటోను మీకొసంగుమని వారు చెప్పిరి" నాభార్య ప్రథమముగా మాతాజీని చూచినపు డెటువంటి భావముతో ఉండెనని చెప్పెనో అట్లే అవిధముగానే ఆఫోటోలో ఉండెను. మాతాజీ "నేను ఎపుడును ఏ ఉద్దేశ్యముతోగాని, నా ఇష్టానుసారముగా కాని ఏకార్యమును చేయను. అదంతయు మీతలంపులను, అభిరుచులను బట్టియే ఈశరీరము మీామంచి కొఱకై ఏదైనా పలుకుటకుగాని, ప్రవర్తించుటకుగాని వీలగుచున్నది.'' అని చెప్పుట ఎంత పరమార్థము. నేనేకోరికతోను ఆమెను సమీపించలేదు. ఆమెయు నన్నేమియు అడగనూలేదు. ఆమె నా యొక్క మనోవాంఛలను గ్రహించుకొని ఇదంతయు చేసినది.

ఆ నాడు భజనలు సమాప్తమయ్యెను. దేవాలయమునుండి ఆమె 9-30 గం॥కు నాతో సెలవుతీసుకొనెను. మరుసటి రోజు సాయంత్రం 4 గం॥ లకు మధురనుండి కన్యాకుమారికి వెళ్లునట్లు నిశ్చయించుకొనెను. నేను ఇంటికేగిన పిదప మరొకసారి ఆమెను దర్శించుట కవకాశము కల్గునో లేనో అని చూడవలెనని అనుకొంటిని. ఆమె శిష్యులకు సామానులను సర్దుకొనుట కేదైనా సహాయ పడవలెనను తలంపుతో 10-30 గంటలకు సత్రమున కేగితిని. వరండాలో నిలుచుని ఆమె శిష్యునితో చాలా హీనస్వరముతో మాట్లాడుచుండగా అకస్మాత్తుగా ఆమె కూర్చుని యుండు గది తలుపులు తెరువబడెను. అల్లదుగో! అచట నున్నదామె! శుభ్రమైన ఒక తెల్లటిదుప్పటి నేలపైన వేయబడినది. ఒక చిన్నదిండును, చిన్నదోమతెరయును పైకెత్తి కట్టబడినది. దుప్పటికి మధ్యగా ఆమె యథాప్రకారము కూర్చొని యుండెను. తెల్లటి వస్త్రములను ధరించి, విరియబోసిన జుట్టును, ఆమె కళా

పూర్ణమైన ముఖమును నాకు కనులపండువాయెను. నేను సాష్టాంగ నమస్కారమును గావించితిని. ఆమె కాశీలో తన ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించెను. నేనామె కెంతో స్వల్ప సహాయమును చేసినను, ఆమె అనేకసారులు నేనుచేసిన దానికి కృతజ్ఞతను తెలిపెను. మరియు ఆమె ఇట్లు చెప్పెను. "చాలామంది నన్ను నేను మాతాజీకి ఏమిచెయ్యవలెనని" అడిగెదరు. అపుడు నేను ఇట్లు చెప్పెదను. "పదునైదు నిముషములు నాకివ్వండి- 8-45 నుంచి 9 గంటల వరకు నిశ్శబ్దతను వహించి భగవంతుని తలంచండి. వేళ చాలా ముఖ్యము. లోకముననుండు భక్తులందరు అన్యోన్య సంభాషణ చేయవలెనన్న అందరును ఒకేవేళ దేవుని ధ్యానించిననే సాధ్యమగును. నువ్వే వస్తువైనను నాకు ఇచ్చిన, అది మరల తీసుకొనకు. నిశ్శబ్దముగా ఏక ధ్యానమునందుండునపుడు వేరేమి చేయకు. అత్యవసరమైన నీదేహమేమి చేయుచున్నను నీమనస్సు భగవంతుని పైననే పెట్టుము." ఇట్లు అరగంట సేపు నాతో మాట్లాడెను. ఆమెను అలసట చెందించుచున్నానని తలంచి మరొకసారి సాష్టాంగ నమస్కారమును చేసి అట్లే వెనుకకు అడుగులు వేయుచు మరలితిని. వరండాకు వచ్చువరకు నాకన్నులు ఆమెనే వీక్షించుచుండెను. తలుపులు మూయబడెను. ఇది అంతయు స్వప్నమా అనునట్లు నేను ఇంటిముఖము పట్టితిని. ఆచ్ఛాయ ఇంకను నా ఎదుట ఉన్నది. ఆదివ్యమైనటువంటి కడసారి చూపునాకు ఎల్లప్పుడు తోడునీడగా నున్నది.

# వదిన

**శ్రీ మురార్జీ**

కాంతుడు పెండ్లిపిల్ల మేలిముసుగు తీయగా ఆకాశముమీది చంద్రుడు భూమిమీదకి వచ్చినట్లు తలచాడు. అందమైన మొగముపై నిడుపైన భ్రూకుటీలముల క్రింద సిగ్గులగ్రక్కు నయనములు వాని లోచన గోచరములయ్యెను. నిర్మల ఇంత అందముగా యుండునని అతడు కలలోకూడా తలంచలేదు. సిగ్గు బరువుచే వంగిన కనురెప్పలనెత్తి పతిని చూడగా ఆమె మొగముపై యమాంతము భయపడిన భావము దోపు వెల్గు ప్రసరించెను. మోటు, నలుపురంగు వ్యక్తిని గాంచి ఆమె చిత్తము భయవిహ్వలమయ్యెను. వీరి కొరకేనా తన తండ్రి యెంతో యుపిర్యారి వీరింట యూడిగము చేసినది? వీరికొరకేనా తనతండ్రి యావజ్జీవార్జితము ధారవోసినది?

కాంతుడీ సంవత్సరము ఎమ్. ఎ. పట్టభద్రుడయ్యెను. ఇన్కంటాక్సు డిపార్టుమెంటులో ఒక మంచి వుద్యోగముకూడా చిక్కెను. ఈ యోగ్యతయే ఒక మంచి కుటుంబమున చురుకుగల అందమైన కన్యకు పెనిమిటిగా ఎన్నుకొనబడుటకు కారణమయ్యెను. బహుసంఖ్యాకులు, కన్యల తండ్రులు ఇంటి చుట్టు తిరిగిరి కానీ నిర్మల అదృష్టమదృష్టము. తండ్రి కృషి ఫలించినది. 15 వేల వరకట్నముచే పెండ్లి నిశ్చయమయ్యెను. ఇంత చురుకైన, యోగ్యుడైన వరునికై 15 వేలును తక్కువే.

'నిర్మలా !'

నిర్మల తన చంద్రుని బోలుమోమును మోకాళ్ళలో దాచికొనినది.

'నాతో మాట్లాడుటకు నీకు భయమా ?'

'లేదు.' ఒక సన్నని రావమామె పెదవులనుండి జారినది.

'నేను నీకు యోగ్యుణ్ణి కాకపోవచ్చును.'

'అట్లుకాదు' అని నిర్మల కాంతుని పాదములపై బడినది. కాంతుడామెను లేపి కౌగలించుకొనెను.

నిర్మల కన్నులు కాంతులు గ్రక్కెను. కాంతుని రూపావలోకనముచే కలిగిన వికలత కాంతుని ప్రేమ రసభరిత హృదయలభ్యముచే తొలగ, హృత్కమలముపై యతని మధురవాక్కులు అమృతము చిలికినట్లు గననయ్యెను. వాని ఆమోటు ఆకారములో ఆ నవీన సుందరి హృదయము నాకర్షించుకొను శక్తి కన్పట్టెను. వారిద్దరొకరి నొకరు ప్రేమించుకొనుచు ప్రపంచములో కాంతునికై నిర్మల, నిర్మలకై కాంతుడే బ్రతుకునట్లు దోప మెలగుచుండిరి. ఒక స్వల్పప్రేమలో పెద్ద హృదయమును గెలువగలశక్తి గదాయని నిర్మల ప్రథమమున ప్రప్రథమ సమాగమ రాత్రమున అనుభవమునకు దెచ్చుకొనెను.

కాంతునకు వరంగల్లు బదలీ యయ్యెను. అక్కడ గవర్నమెంటువారు గృహవసతిని గూడా గల్పించి యుండిరి. అందుచే కాంతుడు నిర్మలను కూడా వెంటదీసికొని వెళ్ళెను.

వరంగల్లు ఇద్దరికిని కొత్తప్రదేశము. కాంతుడు అచ్చటి ఆఫీసువాతావరణములో త్వరగ కలిసెను. కాని నిర్మలకు దినముగడచుట దుర్లభముగనుండెను. ఇది గ్రహించి కాంతుడు తన చిన్న తమ్ముడగు హరీశుని రప్పించుకొనెను. హరీశుడు హైదరాబాదులో Inter చదువుచుండెను. వరంగల్లులోనూ 'ఇంటరు' యున్నందువల్ల తోడుగానుండుటయేగాక చదువునకు విఘ్నము కలుగదను తలంపుచే హరీశుని రప్పించుకొన నయ్యెను.

హరీశుడు ఇంటికిరాగానే చిన్నవోయిన ఇల్లు నిండినది. వాని నవ్వు, వాని మాటలు, వాని కవ్వింపు, వానిరూపు నిర్మలకు చాలా నచ్చినవి. ఆమె హరీశునితో చాలా త్వరలో కలసిపోయినది. హరీశునికి గూడా వదినపై చాలా మమకారము.

'వదినే! నీవు చాలా అందగత్తెవుసుమా !

'మరి నీ కేమన్నా తక్కువా!'

'కాని నీకన్నా తక్కువే.'

'అదెట్లు' అని నిర్మల నవ్వుతూ అడిగినది.

'నిన్నుచూచి వరంగల్లు వారంతా నీ అందానికై చస్తున్నారు.'

'నా అందానికై మా నల్లభామయే చస్తుంది!'

'నల్ల భామ ఎవరు?'

'నా క్లాసుమేటు. మా కాలేజీలోకల్లా అత్యంత కురూపి. అందరూ ఈపేరుతోనే దాన్ని పిలుస్తారు.'

ఇద్దరూ నవ్వారు.

'నల్లపిల్ల ఎప్పుడైనా నీతో ప్రేమమాటలు మాట్లాడుతుందా?'

'ప్రేమమాటలేమిటి? రాగాలాపనలు చేస్తుంది!'

'ఏమని'

'నీవతి సుందరుడవు. నాకు నీపై ప్రేమ, మిక్కిలి ప్రేమ - అత్యంత ప్రేమ - అమితప్రేమ, ప్రేమ! ప్రేమ. నిన్నువదలి నేనుండలేను. బ్రతుకలేను, చావలేను!'

'అప్పుడు నీ వేమంటావు?'

'ఆమె చంపపై ఒక చిన్న పెట్టు పెడతాను.'

'ఎట్లు?'

'ఇట్లు' హరీశుడు వదిన చెంపపై ఒకచిన్న పెట్టు పెట్టెను. వదినె సిగ్గిలినది. హరీశుని అల్లరిపై వదినకు ప్రేమకలిగినది. ఈవిధముగా హరీశుని అల్లరి వదినెకు, వదిన ప్రేమ హరీశునకు ఇష్టమయ్యెను. వారీ విధముగా అమాయకుల రీతి జీవితం గడిపెడి వారు.

కాంతునికి గూడా వీరి ప్రవర్తన చాలా నచ్చగా నిర్మలతో నవ్వుతూ ఒకనాడు 'మాడు! మరది యవ్వనుడు సుమా! ఎక్కువ కల్పించ జేసి కొనకుము.' అన్నాడు. 'మీరు చాల ఇది' అని నిర్మల అలిగి పోయినది. అలుక పోగొట్టుటకు కాంతునికి గంటలు పట్టెను.

వినీల నిర్మలాకాశము, శీతాకాలము, సూర్యుని లేయెండ శరీరమునకు సెదతీర్చుచుండెను. కాంతుడు ఆఫీసుకు వెళ్ళెను. హరీశుడు కాలేజీకి వెళ్ళెను. నిర్మల పనులెల్ల తీర్చుకొని స్నానముచేసి ఎండలో తల ఆరబోసికొని కూర్చుండెను. శరీరముపై ఒక సన్నని వలువ మాత్రముండెను. ఆమె శరీర కాంతులు సూర్యుని ఆతపమునకు జిగేలు మనుచు బయట పడుచుండెను.

కాలేజి త్వరగా మూసివేశారు. హరీశుడు త్వరగా ఇంటికి వచ్చెను. తలుపు మెల్లగా తట్టెను. ఓరగిలిన తలుపు తెరచుకొనినది. అతను లోనికివచ్చెను. లోపల సావిడిలోకి రాగానే వాని కాళ్ళు వణికినవి. ఎర్రని భుజములపై విరియబోసిన పట్టువలె జిగ జిగ మను వదినె వెంట్రుకలు, చీరనుండి బయటకు దూకు ఆశరీర కాంతులు వానిని పిచ్చివానిగా చేసినవి. అతడా సుందరి యావ్వన సౌందర్యమును గ్రోలుచుండెను. శిలా ప్రతిమవలె అటులనే నిల్చిపోయెను. నిర్మల వెనుకకు దిరిగి మరదిని చూచి భయపడినది. సిగ్గుచే ఆమె శరీరము కంపించినది. అమాంతము లేచి గది లోనికి వెళ్ళినది. హరీశుడట్లే నిలిచియుండెను. నిర్మల వలువ మార్చుకొనుచుండెను. హరీశుడు వదిన గదిలోనికి జొచ్చెను. వదిన చీరమార్చి వెంట్రుకల దువ్వుకొనుచుండెను.

'వదిన!'

'హరీశు! ఇంతత్వరగ ఎందుకు వచ్చితివి?'

'నేడు కాలేజి త్వరగా మూశారు.'

నిర్మల స్వరముమారినది. బెదరిన లేడిపిల్లవలె చూపుల జూచుచు

'హరీశుబాబూ!'

'వదినె!'

'నీలో ఏదో మార్పుకనుపిస్తున్నది?'

'ఏమియులేదు. ఏమియులేదు. నేనివ్వాళ్ళ పిచ్చివానినైతిని, నీ అందానికి. నీవింత అందగత్తెవని కల లోను దలంపలేదు సుమీ!'

'నీవు మధువు గ్రోలలేదుకదా!'

'లేదు. నేను సంపూర్ణముగా స్పృహలో నున్నాను. నీలోనున్న సౌందర్యమును జూచుచున్నాను. వదినా! నీవు చాలా సుందరివి!'

హరీశుడు నెమ్మదిగా వదినవైపు వచ్చుచుండెను. నిర్మల భయపడి వెనుకకు జరుగుచుండెను. హరీశుడు ముందునకు వచ్చుచుండెను. హరీశుడమాంతముగా వేగాన్ని హెచ్చించి నిర్మలపై బడబోయెను. నిర్మల తప్పించుకొను నుపాయమునకై దగ్గరనున్న బల్లమీది రాయిని దీసి 'హరీశుబాబూ! నీవక్కడే యుండుము' అనెను. హరీశుడు వినలేదు. ఒక్క క్షణములో రాయి హరీశుని నెత్తిని పగులగొడ్తూ పడెను. వానితలనుండి నెత్తురు కాల్వలై పారెను. అతను స్మృతి దప్పి నేల కొరిగెను.

నిర్మల భయపడినది. ఆమె ఏమిచేసినది? కాని ఆమె ధైర్యమును వీడలేదు. ఏ ధైర్యముతో తన శీలమును కాపాడుకొనుటకై రాతి నెత్తెనో ఆ ధైర్యముతో ఆపరిస్థితి నెదుర్కొనుటకు మునంజవేసెను. హరీశుని శిరము నెత్తి తన వడిలో పెట్టుకొనెను. శిరముపై గాయము కడిగి కట్టుకట్టెను. గాయమేమంత పెద్దదిగాదు. కాని వానిమానసిక పరిస్థితి వానినీయవస్థకు దెచ్చినది.

భర్త వచ్చువేళ సమీపించుచుండెను. ఆమె నెత్తురు పడిన ప్రదేశమును శుభ్రపరచెను. ప్రేమపూర్వకముగా హరీశుని తల ఒడిలో పెట్టుకొని విశ్రాంతి కలిగించుటకు నియుచుచుండెను. రక్తప్రవాహము ఆగినందువల్ల మెల్ల మెల్లగా హరీశునకు స్మృతి కలుగుచుండెను. అతను కండ్లు దెరచెను. వానితల నిర్మల యొడిలో నున్నది.

'వదినే! నన్ను క్షమించవూ? నేను పిచ్చివాడి నైతిని. నీవు నన్ను యుక్తముగా దండించితివి.' వాని కన్నులు జలమయ మయ్యెను.

'ఎంతపిచ్చివాడవు. పొరపాటెవరిచే గాదు? వదినె మాతృస్వరూపముగదా హరీశుబాబూ!' నిర్మల నయనము లశ్రుజలములచే అంధములయ్యెను.

అప్పుడే కాంతుడు ఆఫీసునుండి తిరిగి వచ్చెను.

'ఏమైనది?! అని వాని మొదటి ప్రశ్న.

హరీశుబాబు లేవబోవ నిర్మల వారించి 'ఏమియు లేదు. జట్కానుండి దిగుచుండగా కాలుజారి తల కొట్టుకొని గాయమైనది.'

'డాక్టరు వచ్చాడా?'

'రాలేదు. నేను కట్టుకట్టాను.'

'డాక్టరు నెందుకు పిలువలేదు?'

'ఎవరిచే పిలిపింతును?' కాంతుడమాంతములేచి డాక్టరును పిలుచుటకై బయటికి వెళ్ళెను.

'వదినె!' అని హరీశుడు నిర్మల కాళ్ళను చేతులతో జుట్టివేసెను. నిర్మల వెక్కి వెక్కి ఏడ్చినది.

కాంతుడు నిర్మల హృదయములో దేవపదము నాక్రమించుకొనెను. మరి నిర్మల? నిర్మల హరీశునికి మాతృపదము. కాదు, కాదు. మాతకన్న ఎన్నమిన్న. హరీశుడు చేయినెత్తి చూడగా ఎండిన నెత్తురు మరక కాన్పించెను. దానిలో ఒక స్త్రీ యొక్క నిష్కళంక పవిత్ర చరిత్ర చిత్రించి యుండెను. దానిని అతను తనజీవితములో ప్రప్రథమముగా పరికించెను.



# విరహగీతి



శ్రీ వేపకొమ్మ రాధాకృష్ణమూర్తి, బి. ఎస్.సి.

ఎన్నియొమార్లు మీగృహము కీవల నావల నిల్చియుంటినే
మన్న భవన్ముఖాబ్జమరయన్ తెరిచికొనటంచు, కాని నా
కున్న నదొక్క ఆశయును నూరకపోయెను; నాదు మాటలన్
మన్ననసేయువారెవరు మానిని లోకమునందు సెప్పవే.

నిచ్చలుఁ గష్టకాలముల నెమ్మది దేవుని సంస్మరించుచో
క్రచ్చఱ సౌఖ్యముల్ కలుగు, గాదె, అదేవిధమున్ ద్వదీయ నా
మోచ్చరణంబె నన్నిటుల నోరిమితో మననిచ్చుచుండు, నీ
ముచ్చటె నాకునిచ్చు ముదమున్ సతతంబు, నిజంబు, నమ్ముమా.

చలువవెన్నెలలో కలువపూ గృహములో ప్రేమమీరగ విహరించినటుల
తుమ్మెద యుగళంబుతోఁగూడి పూదేనె తమిదీఱ నిద్దరు ద్రావినటుల
అలవసంతమునందు హాయిగ నిద్దరున్ మరుపూజ లనురక్తి జరిపినటుల
ఇరువురు నేకమౌతరి మన్మథుఁడు పంచ బాణముల్ మనమీఁద బరిపినటుల
కలలుగనుచుందు, నప్పుడక్కలలు నిజమొ
కాదొ, యని అనుమానంబు కలుగుచుండు,
ఏమిచెప్పుదు నీకోసమెంత బాధఁ
జొక్కుచునుంటినో, నరకమే సుఖము కాదె

ఇరువుర మొక్కచోట వసియించినచో నరకంబె స్వర్గమౌ
విరహముచేత మానసము వేగిరపాటును పొందు నెప్డు ని
న్నరయుదునో యటంచు; హృదయంబున నీ విటులెంచవేమొ! త్వ
త్కరుణ కటాక్షవీక్షణ నికాయము నాపయిఁబంపు ప్రేయసీ

ప్రేయసి యంచు నిప్డు నిను పిల్చుచునుంటిని ప్రేమతోడ; న
న్యాయముచేసినట్లగు "ప్రియా" అని నన్ననకున్న, నీవు క

న్యాయగాదె యేమిపుడు మున్నటిరీతి, నిమిత్తమేమొ నా
కీయెడ దెల్పకున్న ఎటులే సఖి నిల్చును నాదుప్రాణముల్ !

మనమున నిట్లు నేను పలుమారులు నిన్ దలపోసికొంచు నుం
టినె, యిటులొక్కమారయిన డెందమునందనుకొంటివే ననున్
ప్రణయిని అద్దె నేనుపడు బాధ గ్రహింపగజాలుదీవ; ఎ
ద్దనుభవమే భువిన్ పరులబాధల దెల్పును గాదె నెచ్చెలీ.

అపుడు సంధ్యల ముచ్చటలాడు స్థలముగనిన మనప్రేమ పల్కులున్ మనవిహార
ములను మనపూర్వ శపథముల్ తలపుకొచ్చి యెదను కోరిక లీరిక లెత్తజేయు.



'కన్నతల్లి'లో జి. వరలక్ష్మి, వసంత, సంబియాన్, నాగేశ్వరరావు.

# From YARN TO HANDLOOM CLOTH





ఉగాదికి

## కో-ఆప్టెక్స్



చేనేత వస్త్రములను కొని వేలకొలది చేనేత పని వారలను ఆకలిబాధ నుండి రక్షించండి.

చేనేత వస్త్రములు ఆదేశీయము మిల్లు వస్త్రములకన్న చవుక అని గమనించండి.







ది మద్రాస్ స్టేటు హాండులూమ్ వీవర్సు కో-ఆపరేటివ్ సొసైటీ, లిమిటెడ్,
జమ్మీ బిల్డింగ్సు : 48/1. రాయపేట హైరోడ్, మైలాపూర్, మదరాసు-4.

(128–పేజి తరువాయి)

నీ కవితావసంత కమనీయలతాంతమనోజ్ఞ సౌరభం
బేమని చెప్పఁదగుఁ హృదయమే యెరుఁగుఁ కవితామతల్లిరో

గంటి కృష్ణవేణమ్మ, ప్రొద్దుటూరు.

♦ ♦ ♦ ♦

శ్రీ కాంతాగిరిజా సరస్వతులు, రాశీభూత కారుణ్య రే
ఖాకర్ణాయత నేత్రలై సుకవిలోక ప్రీతిఁ గావించు, దీ
ర్ఘాకౌతూహల వృత్తి తోను భయభాషా ధన్యనూటుఖ్యాతి, ల
క్ష్మీకాంతమ్మకు వాంఛితార్థ ఫలముల్ చేకూర్చి పాలింతురన్.

భారతమాంధ్రమై పరిమళించిన, 'రాజమంద్రి' యే సతికి జన్మస్థలంబు;
"మధురకవి" సమాఖ్యమానినీయుఁడు, కృష్ణ రాయఁడే భామినీరమకుఁదండ్రి,
'శ్రీపాదకృష్ణమూర్తి' కవీంద్రుఁడే తన్వి కసనూనసకల విద్యాగురుండు,
అతులధీశాలి 'హయగ్రీవగుప్త' యే నారీమణికి మనోనాయకుండు,
పాతక విభంగ గోదావరీతరంగ శీకరంబులే తేమకుఁ జెలిమికత్తె
లట్టి, వైదుషీమశివి, సర్వాంధ్రమందుఁ దలపనెవరీఁడు లక్ష్మీకాంతమ్మనీకు –

మొనమొన్నంగద తావకీ నరచితంబుల్, మేటి విద్వత్కవీం
ద్రని కాయ స్తవనీయ మిప్పటి ప్రభుత్వా మోదముల్ బొంది, కీ
ర్తిని గైసేసె; పురాతనాంధ్రకవయిత్రీ ధన్యగాథా ప్రవా
హనితాంత ప్రముదంబు జెందిరికదా! ఆంధ్ర ప్రజానీకముల్.

నానా కావ్య పదార్థభావముల విన్నాణంబుగావించి, భా
షానీరేజ విశాలపత్ర నయనాసంసేవనాలోల లు
న్నే? నీ చందముగా ధరిత్రి, గృహలక్ష్మి స్వర్ణపుంగంకణ
శ్రీ నీకేలనలంకరించెఁగద! లక్ష్మీకాంత విద్వన్మణీ!

కేసరి వంటిదాత పరికింపఁగ నీసకలాంధ్ర మందనా
భాసము, ఈ కుటీర సహవాసనికే తన మెందు లేదు, నీ
తో సరితూఁగఁగాఁ గలుగు తోయజలోచన లేదటంచు, వి
న్యాస మొనర్చె మాదుకవితాంఘ్రిమణుల్ రవళింప నీ సభన్॥

'కవిచంద్రులు' కోటసోదరకవులు, (అష్టావధానులు)

♦ ♦ ♦ ♦

ప్రియవార్తన్ పులకించె మానస సరోవీచీ సుఖాందోళికా
శయనోల్లాసమరాళశాబకము వత్సాజీ! భవద్భద్ర వా
ఙ్మయకోశంబు సహస్ర పత్రముఖ మంగల్యంబుగావిచ్చి వ
న్నియతో తేనియతో తొణంకునభినందింపంగ నస్మాదృశుల్.

అటు 'ముద్దుకవి' జనకునికి, ఇటు లివదాత నవనీత హృదయుడు పతికిన్,
ఘటియించితి వానందము-తటస్థమగు మిత్రజనము తనియగ విదుషీ,

చదివితివి ఉభయభాషలు,-కదిపితివి విపంచికా సుఖస్వరతంత్రుల్
కదిలింపు మాంధ్ర మహిళా-కదంబమును తెనుగుద్వారకకు కవయిత్రీ!

పెట్ట మదరాసు గాజులు కట్ట మదిర చీరెల మమకారము బలిసెన్
పుట్టి పెరింగిన ఆంధ్రుల నట్టింటి సొగసులు మఱచినారు పురంధ్రుల్.

వాయింపుము నీవీశియ-వాయెండి తపించు తెనుగు వాడలు తడియన్
గాయని! సమాజ దీప-చ్ఛాయలు ముడిగిన నడంగు సౌభాగ్యములున్

లిఖియింపుము క్రోధాగ్ని-విశిఖల్ జ్వాలింపక శమించు శిశిరోక్తుల, దు
ర్ముఖులై, నరు లత్యాశా నిఖాతమున జారిపడి మునిగి పోకుండన్.

చిత్రించుత నీ లేఖిని మైత్రీ ప్రియపాత్రముల, నమంగళ కుటిల
క్షేత్రమలీమసస్యల విత్రంబై మెఱయుతన్ పవిత్రాసి గతిన్

రా. సుబ్బారావు

◆ ◆ ◆ ◆

శ్రీ రమ్యమగుచుదగు నీపేరు బుధుల్ వినతులొసగి పేర్కొనగ మహో
దార గుణసంపదలచే-వారక పెంపొందు ధరణి వరగృహలక్ష్మీ.

అనఘుడు పూతవర్తనుడునౌ మన కేసరి-నూరు కాలముల్
మనవలె విద్యలన్ వెలయు మాన్యచరిత్రల-కంకణమ్ములన్.

దనుపవలెన్ యశీకతిత ధర్మరతిన్-దులలేని సౌఖ్యముల్
గనవలె స్త్రీ జనోన్నతులగాంచుచు మించుశుభోదయమ్ములన్.

గృహలక్ష్మి కంకణ గృహీత శ్రీమతి సౌభాగ్యవతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారికి

అమ్మా శ్రీ లక్ష్మీకాం-తమ్మా బుధపాళిమెచ్చి తలలూపగ పా
త్తమ్ముల తేట తెలుంగున-నెమ్మిని రచియించినావు నిరుపమధాటిన్.

ఆంధ్రకవయిత్రులనియెడు నట్టిపేర-పొలుపు చెలువుల నలరన పూర్వరీతి
మహితభావార్థగరిమ విమర్శవ్రాసి-తెరవయాకైతలకు రుచుల్ దిద్దినావు.

చోలెరిగి విత్తనంబును-పాలెరిగిన పెట్టిపోత పాత్రౌచితులన్
దేటగగని పూజించుట-కోట నృసింహార్యుడెరుగు గురుతరబుద్ధిన్.

శ్రీ కరము రమ్య సౌవర్ణశోభితంబు భవ్యరుచిరవికాస శుభప్రదంబు
ఘనతగాంచిన గృహలక్ష్మి కంకణంబు కరము శోభిలుగాత మీకరమునందు.

చిలకపాటి సీతాంబ, నెల్లూరు.

♦ ♦ ♦ ♦

ప్రశంసాపద్యములు

నాఁడోక కాంత-నిన్ను, నయనాంబుజముల్, వికసింప 'నాయనా!
వేడుకతోడరమ్ము; కడు పెవ్వరుజూతురు? ఆరగించి, నీ
వాడియుఁబాడి పొమ్మనుచు, నన్నపుముద్దనొసంగ; నామె, నీ
నాడు, స్మరించుచుంటివహా! నాణెము! నీగుణముర్వి కేసరీ!

సర్వమృగములయందు, కేసరులను, మృ-గరాజులందురు; డాంభికప్రగతిఁగాంచి
చించి, చెండాడి, మృగములజీవములను-గొంచుఁదిరుగుగుణము-ధిక్కరించవలదె?

జీవములను రక్షఁజేసెడి-లోధ్రార్క-అమృతములనొసంగి-యఖిలయంగ
నాపణులకు, జీవనంబిచ్చు, కేసరీ!-నీకు సరిగలారు-నేడులేరు!

వత్సవత్సరంబు-యుత్సవములఁజేసి-స్వర్ణకంకణముల-శక్తికొలఁది
సతులకొసఁగి, కీర్తిసంపదఁజేకొంటి-వార్యవర్య! పొగడనగునెనిన్ను?

ఊటుకూరిలక్ష్మి-యువిదాశిరోమణి-కాంతలందు, మంచికాంత; స్వర్ణ
కంకణప్రదాన. గౌరవమునుజెందె;-సతులలోనసంతసంబుబొందె.

శ్రీ పరాత్పరుఁడతుల యాశీస్సులొసఁగి-దాతను, గృహీతను, సబంధుతతిగఁప్రేమ
పూర్వకంబుగ రక్షించు; భోగభాగ్య-మాయురారోగ్యశుభములనందఁజేసి,

కల్లూరు అహోబలరావు.

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము



చెన్నపురి రాయపేటయందలి కేసరికుటీరం భవనంలో వార్షికముగ జరుగు గృహలక్ష్మి జయంతి, స్వర్ణకంకణ ప్రదానోత్సవములు శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మి యం. యల్. సి. గారి అధ్యక్షతన వైభవోపేతముగా జరిగెను.

జయంత్యుత్సవములో పాల్గొనవచ్చిన పురప్రముఖులు - స్త్రీలు పురుషులు చందన, పుష్పాదుల సత్కారములతో స్వాగతమివ్వబడిరి. వచ్చిన వారిలో ప్రముఖులు డా. కస్తూరి నారాయణమూర్తి, కామరాజు మైత్రేయి, డా. నారాయణస్వామి, మైదవోలు శేషాచలపతి, డా. సి. ఆర్. కృష్ణపిళ్లె, జి. వెంకటాచారి (ఈస్టరిన్స్), డా. గులాబిబాయి, పురం అన్నపూర్ణమ్మ, మైదవోలు పద్మావతి, గిడుగు లక్ష్మీకాంతమ్మ, కే. చంద్రమతి, రత్నాల కమలాబాయి, అన్నాప్రగడ చన్నగంటమ్మ, ఆచంట శారదాంబ, వట్టం శేషయ్యశెట్టి, వి. దుర్గాకుమారి మొదలగువారు.

చి. వసంతకుమారి దైవప్రార్థనతో కార్యక్రమము ప్రారంభమాయెను.

గృహలక్ష్మి సంయుక్త సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్యగారు సదస్యులకు స్వాగతముచెప్పి జాస్తి సీతామహాలక్ష్మిగారిని అధ్యక్షతవహించి యీమహోత్సవ కార్యక్రమాన్ని జయప్రదంగా జరుపవలసినదిగా కోరిరి.

అధ్యక్షురాలు, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారలు వేదిక నలంకరించిరి. గృహలక్ష్మి సంపాదకులు డాక్టర్ కే. యన్. కేసరిగారు అనారోగ్యముగానుండియు, ఉత్సాహంకొద్దీవచ్చి కూర్చొని ఉత్సవంలో పాల్గొన్నారు.

శ్రీ కేసరిగారు పుష్పమాలాలంకృతులై శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారికి స్వర్ణకంకణ ప్రదానముచేసిరి.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు ఉచిత రీతిన ప్రత్యుత్తరమిచ్చిరి.

శ్రీమతి యం. సుశీలాదేవి, కె. చంద్రమతి, కవిచంద్రులు, కోటసోదరకవులు జయంత్యుత్సవమునకు వచ్చిన సందేశములను, ఆశీస్సులను, పద్యరత్నములను చదివిరి.

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు ఉపన్యసిస్తూ ఉత్తమలక్ష్యాల సాధనకని ఏర్పడిన 'గృహలక్ష్మి' లాంటి పత్రికలను ఆదరాభిమానములతో కొని చదివి సత్ఫలితాలు పొందిననేకాని పత్రికా రచన అభ్యుదయ దశలో నుండదనియు, ప్రతివారు రచయితలు కావలెనని ప్రాకులాడిన మాత్రం చాలదనియు, శ్రీ కేసరిగారు సయితం యీ పత్రిక శాశ్వతంగా నిర్వహింపబడేందుకు ఏర్పాట్లు చేయాలని కోరారు.

శ్రీమతి యన్. యామిని పూర్ణ తిలకమ్మ, యస్. రామచంద్ర అగస్త్యగారలు గృహలక్ష్మి పత్రికను, శ్రీ కేసరిగారిని, కంకణగృహీత శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని ప్రశంసిస్తూ ఉపన్యసించిరి.

అధ్యక్షురాలు తన ఉపన్యాసములో తాను కవయిత్రికాకపోయినప్పటికి శ్రీమతి లక్ష్మీకాంతమ్మ లాంటి విదుషీమణులు, వక్తలు మాట్లాడుతుంటే వినాలని ఉవ్విళ్లూరుతుంటాననియు, తాను యీ మహోత్సవములో పాల్గొనకలుగు నవకాశమిచ్చినందుకు కృతజ్ఞతను వెల్లడించిరి.

శ్రీ సి. సి. పున్నయ్యగారు వందన సమర్పణము సందర్భమున కవులు, కవయిత్రులు సామాన్యప్రజానీకపు జీవితముతో సన్నిహిత సంబంధముకలిగి, అన్నిరంగాలలోను ప్రజలకు మార్గదర్శకంగానుండే కవితలను కూర్చి దేశశ్రేయస్సుకు తోడ్పడవలెననిరి.

మద్రాసు నగర భవిష్యత్తును గురించి ప్రస్తావిస్తూ ముఖ్యంగా నగరంలోని తెలుగువారు తమ న్యాయమైన హక్కులకొరకు శాంతి, అహింసలద్వారానే వ్యవహరించాలనియు, ఆ నాడు విజయంతథ్యమన్నాడు.

అంతటితో ఉత్సవకార్యక్రమము సమాప్తమాయెను.



కృష్ణా పిక్చర్స్ వారి 'అన్నలక్కలు' లో నొక దృశ్యము





ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి 'పెంపుడుకొడుకు' లో పుష్పవల్లి కుమారి.



# శ్రీధర

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

(గతసంచిక తరువాయి)

## ౬

ఈవిషాద ఘట్టం గుర్తుకొచ్చేటప్పటికి నామేను పులకరించింది. శరీరంలోని రక్తం వేగంగా ప్రవహించింది. ఆ నిశీథి సమయంలో నిగూఢంగా నాజననీ జనకులకు అశ్రుపూరితమైన నేత్రాలతో నమస్కరించాను. మొండి జీవం నాది! మున్నిత హృదయాలను ఎలా తెలుసుకో గలుగుతుంది? నాకన్నీళ్లు ఎవరికి కనబడతాయా అంధకారబంధురమైన జగత్తులో! పగటి వేళలోనైనా అరణ్య రోధనం పశుపక్ష్యాదులైనా గుర్తిస్తాయి. అవిమాత్రం ఏం చేయగలవు? 'కూయిడు'తూ తమ సంతాపాన్ని తెలియచేస్తాయి కాళ్ళల్లో ఎన్ని ముళ్ళు నివసిస్తున్నాయో అప్పటికీ యిప్పటికీ నాకు తెలియదు. వాటిమీద నడవటం నల్లేరుమీద బండి పోవటం లాగయింది.

అశ్మశాన వాటిక దూరమౌతున్నది. సన్నని వెలుగు అంతమౌతున్నది. నిశ్శబ్దదేవత జగమంతా వ్యాపించింది. కాని ఆమె నాహృదయంలో ప్రవేశించలేకపోయింది. నిద్రా దేవతకు గూడ ఎక్కువై పోయాను. ఆమె తన చల్లని చేతులతో ఒడిలోకి 'జో' కొట్టనైనా లేదు. నిశాచరుడినైన నాకు నిద్రాహారాలేమిటి? అన్నిటినీ విసర్జించిన వాడికి నిద్ర ఒక్కటి ఎక్కువా? అలానే గుంటల్లో పడుతూ, మిట్టలు ఎక్కుతూ, చెట్లుపుట్టలు దాటుతూ హృదయావేగంతో భారమైన శరీరంతో తూలుతూ ఏడుస్తూ నిబిడాంధకార నిశీధిని నిశాచరుడిలాగా నిర్భీతితో పంచరిస్తున్నాను. భూత ప్రేతాదులు గూడా నన్ను చూచి భయపడినాయేమో! దగ్గరికి చేరలేదు, ఇలాంటి రాక్షస ప్రకృతి గల మానవుడిని చూచి ఏభూతం భయపడదు? అవి ఏరూపంలోనూ కనబడలేదు.

నిర్జన కీకారణ్యంలో చెట్లమధ్యనుంచి అష్టమి చంద్రుడి పసిడి కిరణాలు అక్కడక్కడా వ్యాపించి వాటి నిజస్వరూపాలను అర్ధనగ్నంగా తెలియజేస్తున్నాయి. చంద్రుడిని చూచి కొన్ని పక్షులు కిలకిలమన్నాయి. కొన్ని గాలిలో ఎగిరినాయి. మలయపవనుడు విజృంభించి చెవులనందుగుండా శరవేగంతో దూసుకు పోతున్నాడు. హిమం కురియటం మూలకంగా భూమి అంతా చల్లగావుంది. నాదేహం తడవిచూచుకున్నాను. చల్లగా మంచు గడ్డలావుంది. ఇంతవరకు గుర్తించనేలేదు! గుర్తించి మాత్రం ఏం ప్రయోజనం? వంటిమీద మాసికలు వేసిన చిన్న చొక్కా, చిన్నలాగు తప్ప దేహాధారణకింకే ఆధారమూలేదు. గడ్డి అక్కడక్కడా దుబ్బులు దుబ్బులుగా పెరిగివుంది. ఒకటిరెండు పాములు నాముందుగా గడ్డిలోనుండి పరపరమని ప్రాకి పోయినై. గమ్యస్థానం లేని కడలి నౌకలాగా దారి తెన్నూ లేకుండా తిరలి పోతున్నాను.

ఒకసారి నాచుట్టూ కలయచూచాను. గాఢాంధకారం కన్నుపొడుచుకున్నా ఏమీకనబటం లేదు. క్రమంగా నక్షత్రాల గుడ్డివెలుగు గూడా మాయమౌతున్నది. వాయుదేవుడు ప్రళయ తాండవనృత్యం మొదలు పెట్టాడు. కారు మేఘాలు గగనసీమను కప్పివేసి ఘూర్ణిల్లుతున్నాయి. మెరపు దీపెలు కన్నులను కటిక-చీకటిలోకి లాక్కుపోతున్నాయి. చెట్లన్నీ

దేహ సంచలనం గలిగి ఉద్రూత లూగుతున్నాయి. తమ ఆధారభూతమైన వృక్షసముదాయాని కాపద వాటిల్లుతున్నట్లుగా పక్షులు కిలకిలా రావముతో అడవి ప్రదేశాన్ని మారుమ్రోగిస్తున్నాయి. తమ పసికూనలను కాపాడుకోలేని అసహాయ స్థితిలో వుండి తల్లులు దీనాతి దీనంగా కూయుదుతున్నాయి. దూరాన్నుండి నక్కకూతలు వినబడుతున్నాయి.

నామేను గగుర్పొడిచింది. చలివేయసాగింది. ఎటుపోవటానికి దారితెలియటంలేదు. చిట పటమని చినుకులు ఆరంభమైనై. ఏదైనా పెద్దచెట్టు క్రిందకు పోయి నిలబడదలంచి చెట్లుకొట్టుకుంటూ పోతున్నాను. ఉరుములు మెరుపులు అధికమైనై. ఏనుగు తొండంతో చిమ్మినట్లు, కడవలతో కుమ్మరించినట్లు వర్షం జోరుగా కురియసాగింది. గాలి తన శక్తినంతటినీ ప్రదర్శిస్తున్నది. గుడ్డలు శరీరాని కంటుకుపోయినాయి, దేహమంతా తడిసింది. ఒక సరివి చెట్టును కొట్టుకున్నాను. ముఖాన గాయమైంది. రక్తం కారుతూంది. చేతులతో తడుముకుంటూ గుడ్డివాడిలాగా, వణుకుతూ చెట్ల సందుగుండా పోతున్నాను. వెళ్ళి వెళ్ళి ఒక ముళ్ళకంపలో పడ్డాను. అప్పుడు నాస్థితి వర్ణించటానికి శక్యం కాకుండా వుంది. వళ్ళంతా జీరుకుపోయింది. వర్షపు నీటితో బాటు నారక్తంగూడా భూదేవి తనువుపై ప్రవహిస్తున్నది. కొన్నిముళ్ళు శరీరంలోకి దిగినై! కన్నులలోకి గుచ్చుకు పోయేవే కాని యింకా భూమి మీద యీపాపిష్టి కళ్ళతో మిగిలిన బాధలు అనుభవించాల్సి వున్నందుకది సంభవించలేదు.

అక్కడినుండి లేచాను. మెల్లగా ఒక్కొక్క ముల్లుతీస్తుంటే రక్తం చిమ్మికొడుతున్నది. బాధ ఎక్కువైంది. నాశరీరం అరుణశోభను దాల్చిందో లేక వరుణ దేవుడితో కలిసి మామూలు స్వరూపాన్ని ధరించిందో తెలియదు. స్మృతితప్పి పడిపోయే పరిస్థితి ఏర్పడింది కాని అట్లా జరగలేదు. అలాగే దెబ్బలు కొట్టుకుంటూ ఒక చెట్టు క్రిందకు జేరాను. శరీరంలో పొడి ప్రదేశమనేది ఎక్కడాలేదు. బాహ్య శరీరాన్ని వరుణదేవుడు తడిపాడు. హృదయంలోపల దుఃఖాశ్రువులచే పొడి ప్రదేశమే లేకుండా పోయింది. ఏదేవత గూడా ఉపశమింపకుండా తమశక్తినంతటినీ ప్రదర్శిస్తున్నారు. ఆవిజృంభణను అరికట్టలేక కొన్ని చెట్లు పెళ పెళమని నేల కొరిగాయి. కొన్ని నడుమువాల్చాయి. నేనుకూర్చున్న చెట్టుపెద్దది కావటం వల్ల అంతగా భయపడాల్సిన అవసరం లేకపోయింది. ఆచెట్టుమీద ఉన్న పక్షులన్నీ నాలాంటి అసహాయులే. నా ఆక్రందనంతో వాటి ఆక్రందనం మిళితమై ప్రకృతి దేవతను వేడుకుంటున్నది. అవి ఒకకొమ్మ మీదనుండి యింకో కొమ్మమీది కెగురుతూ విలపిస్తున్నాయి. నావిలాపం వాటివిలాపం ఆలకించేదెవరు ఆ కాననంలో? ప్రకృతి దేవతకూడా మాపై పగబూనింది. అటువంటప్పుడు యింక చేసేదేమున్నది.

దేహం మీదవున్న దుస్తులను తీసివేద్దామనుకున్నాను. కాని అవి సహజ కవచాలలాగా అంటుకొనిపోయినై! తలంతా బాగా తడిసింది. కేశసంస్కారం లేక దుబ్బుగా పెరిగివున్న జుట్టు కావటం వల్ల జలుబు చేస్తుందేమో ననుకున్నాను. చలిగాలిలో గాయాల మూలకంగా వళ్ళంతా పోట్లుపుడుతున్నది.

* * *

స్మృతి వచ్చేటప్పటికి చంద్రుడు నడినెత్తిన ఆడుతున్నాడు. అప్పటి వరకూ మేఘాలచే కప్పబడి వికృత రూపం దాల్చిన వాడిప్పుడు పసిడికాంతులను యీ అడవిమీద ప్రసరింప జేస్తున్నాడు. నా అరణ్యరోదన ఆయన అడవిగాచిన వెన్నెల రెండూ ఒక్కటే అయినాయి. చుక్కకన్నెలు చంద్రుడితో పరిహాసాలాడుతూ అతని గమనాన్ని అనుసరిస్తున్నాయి. చిరుమబ్బులు చెంగు చెంగున పరుగెడుతూ అదృశ్య మౌతున్నాయి. మలయ పవనుడు మధుగంధవాహనుడైనాడు.

నామేనొక్క సారిగా గగుర్పొడిచింది. గుడ్డలు కొద్దిగా ఆరినై! అక్కడక్కడ రక్తపు మరకలున్నాయి. కొన్ని కొన్ని గాయాలనుంచి రక్తం వస్తూనేవుంది కొద్దిగా!

లేచాను. కాళ్ళు తడబడుతున్నై. రక్తం అధికంగా పోవడం మూలకంగా నీరసంగా వున్నది. ఆకలి బాధించసాగింది. వేటికి దూరమైనా నిద్రాహారాలకు దూరం కాలేకుండా వున్నాను. ఆకలి దహించుకు పోయేవానికి ఏది దొరికినా అమృతోపమానంగా వుంటుంది. ఆ అడవిలోనే తిరిగి గాలికి రాలిన పండ్లు ఏరుకొని ఆరగించాను.

నడి సముద్రంలో వున్న నావకు ఏది ఆధారమో నాకూ అదే ఆధారమైంది. అదంతా భగవంతుడి మీద భారం వేశాను. ఇంటిదగ్గరి కష్టాలు తప్పించుకోటానికిగాను యింకొక చోటికి పోతున్నాను. కాని అవినన్ను వదిలేటట్టులేవు! వాటిననుభవించే వాడు లేడని నన్ను కల్పించాడేమో! దుఃఖంలో గూడా ఆశకు తావుంది! ఏనాటికైనా గట్టెక్క లేకపోతానా అనే ఆశను కల్పిస్తుంది. దానినే జీవితాశ అంటారు. అది లేకపోతే మనుష్యుడు పశువుతో సమానమే! కాని 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నట్లు అత్యాశకూడదు! నిరాశతో కుమిలి పోయే హృదయాలలో గూడా ఆశాలేశానికి తావుంది. కాని అది నిస్పృహా, నిట్టూర్పులచేత కప్పబడి వుంటుంది.

పిల్లగాలి మెల్లన వీస్తుంది. అష్టమి చంద్రుడు చిన్న చిన్న మేఘపంక్తులను ముద్దుపెట్టుకుంటూ ఆడుకొంటున్నాడు. ప్రశాంతత అన్నివైపుల తాండవిస్తున్నది. ఆకాశాన చుక్కలు మినుకు మినుకుమంటూ చంద్రుడిని వెక్కిరిస్తూ ఆడుకుంటున్నయి. పరస్పరానురాగంతో మేనులు మరచి హాయిగా సంచరిస్తున్నాయి. వాటికప్పటికీ ఎడబాటులేదా అనిపించింది నాకు.

నిర్జనకీకారణ్యంలోంచి కంటకయుతమైన బాటలో నడచి పోతున్నాను. వంటిన వున్నదుస్తులు ఆరిపోయినై. వర్షంలో తడిసి నానిపోవటం మూలకంగా జలుబు చేసింది. చెవులు పోట్లు పుట్టినై. దీనికితోడు శరీరంలో వున్న ముళ్ళబాధ. అంతా ఒకటేబాధ! అన్నిబాధలూ ఒకటే అవుతున్నాయి. మెల్ల మెల్లగా కొంతదూరం నడచిపోయి ఆ అడవి ప్రదేశాన్ని దాటగలిగాను. చిన్న మైదానం ప్రవేశించాను. చంద్రుడి మోము విన్నవై పోతున్నది. మసక చీకటిగా వుంది. తూర్పున ఉషఃకాంతులు గోచరిస్తున్నాయి. పక్షులు కిల కిలమన్నాయి. చుక్కలు వెల్ల వెలపోయినాయి!

౨

దూరాన ఒకచిన్న గుడిసె కనిపించింది. ఈప్రదేశంలో ఎవరుంటారబ్బా అనిపించింది. ఏమోననుకుంటూ అక్కడికి త్రోవతీశాను. దగ్గరకు వెళ్లాను. అప్పుడే అక్కడొకడు నాగస్వరం ఊదుతూ పాముని ఆడిస్తున్నాడు. వాళ్ళు పాములవాళ్ళని తెలుసుకుంటానికి అట్టే ఆలస్యం పట్టలేదు. కాసేపు దూరంగావుండి ఆటచూస్తున్నాను. అతడు తలెత్తి చూశాడు. నేనతని కంటపడ్డా! ఆశ్చర్యంగా చూస్తూ ఏదో అడిగాడు. ఆభాష నాకు తెలియలేదు. నాకు తెలియటం లేదన్నాను. నామాటలర్థమైనాయా తనికి! 'ఎవరు నువ్వు' అన్నాడు. ఏమని చెప్పను? ఈ పాములవాళ్ళకు అన్ని భాషలూ వచ్చును. దేశం తిరగటం మూలకంగా ఎక్కడ ఏభాష ప్రచారంలో వుంటుందో అదిపట్టుబడిపోతుంది. వీళ్ళూ అలాటివాళ్ళే. ఇప్పుడు నామాటలతనికి తెలిసినై. నాభాష అర్థమైంది. మళ్ళీ 'ఎవరు నువ్వు' అన్నాడు. 'తల్లీదండ్రీలేని అనాధబాలుడిని' అన్నాను.

'ఎందుకొచ్చావు?'

'ఉండటానికిచోటు తినటానికితిండీ లేక!'

నాకళ్ళల్లోకి పరీక్షగా చూశాడు. తలపంకించాడు. వాళ్ళభాషలో ఎవర్నో పిలిచాడు. లోపలినుండి ఒక స్త్రీ వచ్చింది. అతని భార్య అనుకున్నాను. వాళ్ళభాషలో నన్నుచూస్తూ ఏదో చెప్పాడు. ఆమెలోపలికి పోయింది. ఆప్రదేశమంతా ఒకేవిధమైన దుర్గంధంతో నిండివుంది. ఆస్త్రీ ఒక మూకుడులో ఏదో తీసుకు వచ్చింది. అతడందుకొని నాకిచ్చాడు. ఏమిటని చూచాను.

(సశేషము)

# చిత్రసమీక్షలు

శ్రీ సి. సి. పున్నయ్య

## బ్రతుకు తెరువు :

ఈచిత్రంలోని కథావస్తువు ప్రస్తుతం అనుదినం ఎదుర్కొంటున్న 'నిరుద్యోగ సమస్య' కు సంబంధించింది. న్యాయంగా ధర్మంగా ప్రవర్తిస్తూ, వ్యక్తిత్వానికి, ఆత్మగౌరవానికి ప్రాకులాడేవారికి ఈలోకంలో బ్రతుకుతెరువుకు అవకాశాలు చాల కొద్దియని నిరూపిస్తున్న దీచిత్రం. అంటే బూటకంగా, డంబంగా జీవితం గడిపేవాడికే యీనాడు జీవితావకాశాలు మెరుగుగా నున్నవనే సత్యాన్ని చాల నైపుణ్యంగా చిత్రించబడింది.

కథ ఒడుదుడుకులు లేకుండా సాఫీగా నడిచింది. సంగీతం మనోహరంగా నున్నది. నటీనటులు—నాగేశ్వరావు, సావిత్రి అత్యద్భుతంగా నటించారు. శ్రీరంజని కూడ చక్కగానే నటించింది.

సంభాషణలు సందర్భానుసారంగా చమత్కారయుక్తంగా నున్నవి.

ఈచిత్రం విశేషంగా ప్రజాదరణకు పాత్రము కాగలదనుటలో సందేహములేదు. ఇట్టి ఉత్తమ చిత్రం నిర్మించినందుకు భాస్కర్ ప్రొడక్షన్స్‌వారు, డైరక్టరు రామకృష్ణ అభినందనీయులు.

## అమ్మలక్కలు :

కృష్ణాపిక్చర్స్ వారి 'అమ్మలక్కలు' చిత్రము విడుదలయినది.

ఇందులోని కథావస్తువు దండగతిండి తిని యిల్లిల్లు, గడపగడప తిరుగుతూ బాధ్యతా రహితంగా ఊళ్లో సమస్యలన్నీ తమవేనని పైనవేసికొని కొంపలారుస్తూ, దానిమూలంగా ఛీవాట్లు, చెప్పదెబ్బలు తింటూ యుండే 'అమ్మలక్కల'కు ప్రాముఖ్యమిచ్చింది. ఇంకా అల్పసిరి మూలంగా మాటతప్పకుండే పెద్ద మనుష్యులు, సంఘంలో అత్తల అఘాయిత్యాలు, అక్రమాలు, కోడళ్లు మంచివారైనా యిటువంటి అత్తలచేతుల్లోను, ఆడబడచుల చేతులలోను పడే కష్టాలు, చివరకు అట్టి అత్తలకు, ఆడబడచులకు ఉత్తమురాండ్రైన కోడండ్రు బుద్ధిచెప్పి సన్మార్గంలో పెట్టడం సహజమని యీచిత్రములో చిత్రించబడింది.

కథ ప్రస్తుతపు సంఘంలోకి అత్యంతావశ్యకమైనదయినా యిందలి సంభాషణలుమాత్రం పచ్చిపచ్చిగాను, మొరటుగానున్నవి. పైగా యిందలి నృత్య భంగిమములు కొన్ని విసుగుగా కూడనున్నవి.

సంగీతంలో ప్రత్యేకత ఏమిలేదు. యన్. టి. రామారావు అంతగా రాణించలేదు. లలిత, పద్మిని మొదలగువారు బాగా నటించారు.

అయినప్పటికి యీచిత్రం ప్రజలను విశేషంగా ఆకర్షిస్తుందనే చెప్పాలి.

## పుట్టిల్లు :

రాజా ప్రొడక్షన్స్‌వారి 'పుట్టిల్లు' విడుదలయింది. కాని ప్రజాదరణకు పాత్రముకాకపోవుటకు కారణము కొంత వివిధ పత్రికల వాళ్లు చేసిన అనాలోచిత విమర్శలే కారణమేమో! చిత్రము రిఎడిట్ అయినతర్వాత చూచిన వారు మాత్రం సానుభూతితోటి, ప్రోత్సాహపరచే దృష్టితోటి యీ చిత్రాన్ని పునర్ సమీక్ష చెయ్యడం ధర్మం.

ఈ చిత్రములోని కథావస్తువు సాధారణమయినదయినానే అత్యంతావశ్యకరమైనది. తన కుమార్తె శ్రేయస్సు కోరి తనయిల్లు గుల్లచేసికొని, తనస్థితానికి మించిన కట్నమిచ్చి, అల్లునకు చదువునకని వందలకు వందలు పంపుతూవస్తే, అల్లుడు దురలవాట్లకు, దురభ్యాసాలకులోనై, చివరకు తన తల్లిమాటలు విని భార్యాబిడ్డలను చెట్టుగుట్టలపాలు చేస్తాడు. ఆమె ఆత్మబలంతో, తన మంచితనంతో బ్రతికి నిరాధారగానున్న తాను స్వశక్తితో, జీవనోపాధిని గౌరవంగా సమకూర్చుకోకలిగి పుట్టినయింటి గౌరవాన్ని నిలుపగలిగింది కూతురు. తప్పుడు మార్గాలలో సంచరిస్తున్న భర్తకు జ్ఞానోదయ మయ్యేటట్లు చేసింది.

ఇందులో పూర్వాచారపరాయణుల 'యీడొచ్చిన ఆడపిల్లలకు చదువెందుకు' అనేవాదం ఎంత బలహీనమయినదోకూడ చిత్రించబడింది. అంటే అవసరమయితే స్వశక్తిమీద నాధారపడి తన్ను, తన్ను అనుసరించుకొనియున్న వాళ్ళను పోషించుకోడానికి తన మానము, అభిమానము స్త్రీ త్యాగం చెయ్యనవసరం లేదనియు, తనవిద్య విజ్ఞానముల మూలంగా తన్ను, తనకుటుంబము చక్కబెట్టుకోగల అవకాశములు మెండని యిందులోని ప్రధాన కథావస్తువు.

శ్రీ రాజారావుగారికి చలనచిత్ర రంగంలో అనుభవం తక్కువైనా యీచిత్రాన్ని ఉత్తమ ఆదర్శ లక్ష్యాల సాధనకని తీశారు. కథావస్తువు నడక, పొందిక అక్కడక్కడ క్రమంగా లేకపోయినా మొత్తముమీద ప్రథమ ప్రయత్నముగాని, సామర్థ్యంతోనే దర్శకత్వము నిర్వహించాడు.

శ్రీరాజారావుగారి సామర్థ్యమును పేర్కొంటూ యిందులో ప్రవేశపెట్టబడిన నూతన తారల నటనా కౌశలము, తక్కువ డబ్బు ఖర్చుతో చిత్రం తయారీ మొదలగునవి పాఠకుల దృష్టికి తేవలసియున్నది.

ఇందులోని సంగీతము, నాట్యభంగిమములు అభ్యుదయ దశలోనివనేచెప్పాలి.

సుంకర, వాశిరెడ్డిగార్ల సంభాషణలు, పాటలు చక్కగానున్నవి.

శ్రీ వి. యన్. రెడ్డిగారు ఛాయాగ్రహణ నిర్వహణకు, దరిమిలా జరిగిన నిర్వహణకు తేడా కనుపిస్తున్నమాట వాస్తవమేకాని సంఘంలో మాత్రం విప్లవాత్మకమైన మార్పులకు యీచిత్రం ఎంతో ఉపకరించగలదనేది సత్యసమ్మతం.



స్వర్ణకంకణ మహోత్సవ సభా చిత్రము.




**భక్తిగీతములు:** శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు, ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్, సన్స్, మద్రాసు. వెల 0-3-0

పుస్తకము చిన్నదయినా యిందలి గీతములు రసభరితములుగా నున్నవి. చక్కని మృదుమధుర సరళిలోనున్న యీగీతములు సామాన్య ప్రజానీకపు అభిమానానికి పాత్రము కాగలవనుటలో సందేహము లేదు. గ్రంథకర్తయొక్క గేయరచనా నైపుణ్యము ఆంధ్రప్రజానీకమునకు తెలియనిదికాదు.

**భావలింగశతకము:** శ్రీమతి దామర్ల సుందరమ్మ, ప్రతులు దొరుకుచోటు: కొండవీటి వెంకటకవి, కవిరాజగ్రంథమాల పొన్నూరు, గుంటూరుజిల్లా. వెల. 0-6-0.

ఇది శతక వాఙ్మయమున కొక కానుక. ఏనాడో ప్రారంభమయిన యీవాఙ్మయము ప్రజా జీవితముపై అన్నిరంగాలలోను మహోత్కృష్టమైన ప్రభావము కలిగియుంటున్నది. అందులోను భగవన్నామ స్మరణకు ఉద్దేశించబడిన యీచిన్న పుస్తకము తేటతెల్లనుడులతో ముచ్చటగా నున్నది.

**సుధాకలశము:** శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి, తలమర్ల కళానిధి, పుట్టపర్తి నారాయణాచార్యులు. ప్రచురణకర్తలు లలితకళా పరిషత్తు (రాయలసీమ) అనంతపురం.

ఇది చిన్న పద్యముల గ్రంథమయినా కవిత్రయము రచించారు. ఇందులోని పద్యములు రసవంతంగాను, మనోజ్ఞంగా నడిచినవి. రాయలసీమ ఉత్తమ కవిత్వానికి నిధి. దానిని సార్థకం చేస్తున్నదీ గ్రంథము. అరవిందోపాసన, జపమాల, రాయలసీమ, ప్రేమతపస్విని, శివతాండవము మొదలగు ప్రకరణములు యిందులో నున్నవి. ఈగ్రంథాన్ని గురించి దానిపేరే చెప్పుచున్నది.

**మాతృత్వము, శిశురక్షణ:** శ్రీమతి పార్వతీ శ్రీనివాసన్. అనువాదకురాలు: మో. శ్రీ. సీతాదేవి చెల్లం. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్. 292 ఎస్ప్లనేడ్, మద్రాసు. వెల 3-0-0.

ఇది మహోత్కృష్టమైన గ్రంథము. ఇందులోని వివిధ విషయాలు అనుభవపూరితమయినవి. అనేక మంది నారీమణులు యిందు వివరించ బడిన అనేకవిషయాలు తెలియక తాము, తాము కన్న బిడ్డలు ఆరోగ్యమునకు దూరమై పలుయిక్కట్లకు పాలగుచుంటారు. కాబట్టి మాతృత్వానికి, శిశుసంరక్షణకు అవసరమగు విజ్ఞానము చాల అవసరం. ఈవిజ్ఞానమును యీగ్రంథపఠనమువలన సంపాదించి ఆరోగ్య సౌభాగ్యములను నారీలోకం బడయగలదని మానమ్మకం.

# సంపాదకీయములు

## మార్షల్ స్టాలిన్ అస్తమయం

గడచిన ప్రపంచయుద్ధంవరకు జగదేకవీరులుగా ఎన్నిక అయిన హిట్లరు, ముసోలినీ, స్టాలిన్‌లలో మిగిలినవాడు మార్షల్ స్టాలిన్ మాత్రమే. మొదటియిద్దరు ఎంత గొప్పవారైనా, వారి మరణాన్ని ప్రపంచం వారితో ఫాసిజం అంతరించింది కదాయని సంతోషించింది. దాంతోటియుద్ధభయం నశించి ప్రపంచశాంతి అభ్యుదయాలు చేకూరుతవికదాయని ఎదురుచూచింది ప్రపంచప్రజానీకం. కాని అట్టి శాంతి అభ్యుదయాలు సమకూరినవా ? లేక సమకూరనున్నవా అనేది యింకా గడ్డుసమస్యగానే నిలబడిపోయింది.

ఈనాడు మార్షల్ స్టాలిన్ అస్తమయమును ప్రత్యేకమైన దృష్టితో చూడబడుతున్నది. రష్యాలో మిగిలిన సమస్యలు ఎట్లున్నా ఉన్నవాళ్లు లేనివాళ్లు అనే తారతమ్యములేకుండా కూడు, గుడ్డమొదలగుదైని కావసరాలను మార్షల్ స్టాలిన్ పాలన సమకూర్చ కలిగింది. దేశం సర్వతోముఖాభివృద్ధిగాంచింది. ప్రధానవసరాలైన కూడు, గుడ్డ, వైద్యసౌకర్యాలు, విద్యాసౌకర్యాలను ప్రజలకు సమకూర్చే బాధ్యత ప్రభుత్వము వహించింది కాబట్టి వానికొరకై అలమటించే ప్రజానీకం ఆ దేశంలో లేదు. సోమరితనమనేదానికి అవకాశము లేకుండా దేశశ్రేయస్సుకై కృషిచేస్తూ ప్రభుత్వంతో సహకరిస్తూ దాని ఫలితంగా సత్ఫలితాలను పొందుచున్నదీ రష్యాదేశపు ప్రజానీకమన్నమాట యదార్థం.

అయితే రష్యా రాజ్యాంగం మహోత్తమమయిందనిగాని, లోపరహితమయినదనిగాని అనసాహసించడం లేదు. కాని ప్రజలశ్రమకు ఫలితంగా దైనిక ప్రధానావసరములను తీర్చకలిగింది ఆ రాజ్యాంగ విధానం. దీనినిచూచి ప్రపంచములో ఆకలి మంటలతో అలమటిస్తున్న వివిధ ప్రాంత్యాల ప్రజానీకం అదే విధంగా తమ ప్రధాన దైనికావసరాలు ఏనాడు తీరి సుఖపడగలమాయని ఎదురుచూడటంలో విశేషములేదు. అట్టి రాజ్యాంగసారధి మార్షల్ స్టాలిన్ మరణానికి ప్రపంచమంతటా విచారము తెలుపుతున్నదంటే తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించడమే అగుతుంది.

మార్షల్ కొద్ది అంతస్తునుండి స్వశక్తి, ధైర్యము, త్యాగములతో ఉన్నతపదవి నలంకరించి తనదేశ ప్రజలయొక్కయేకాక దేశదేశాలవారి ప్రేమ, ఆదరాభిమానములకు, ప్రశంశలకు పాత్రుడైన జగదేకవీరుడు.

స్టాలిన్ అనంతరముకూడ రష్యా ప్రజలు, రాజ్యాంగాధినేతలు శాంతికాముకులై ప్రపంచ శాంతి సౌభాగ్యాలకు దోహదమివ్వగలరని ప్రతియొక్కరు ఎదురుచూస్తున్నారు.

## స్వర్ణకంకణ ప్రదానోత్సవము

ఈసంవత్సరము 'గృహలక్ష్మి స్వర్ణకంకణము' శ్రీమతి ఊటుకూరి లక్ష్మికాంతమ్మగారికివ్వబడింది. ఆమె కీగౌరవము కవయిత్రిగాగాని, విదూషీమణిగాగాని, వక్తగాగాని మాత్రము గుర్తించి యివ్వబడింది కాదు. ఆమె సంఘసేవాభిలాషి, సంఘనిర్మాణంలో ఆసక్తి కల నారీమణికూడాను.

మహిళా సంఘనిర్మాణ సందర్భమున నైతేనేమి, సంఘసేవా సందర్భమున నైతేనేమి ఉదార హృదయంతో, విశాలదృక్పదంతో స్వార్థరహితంగా కృషిచేసేవారికి మా సానుభూతి, ప్రోత్సాహాలు ఎల్లప్పుడు అందుబాటులో నుంటవి. ఏమహిళా సంఘమైనా ఉత్తమ ఆదర్శలక్ష్యములతోటి, విశాల దృకపథంతోటి నిర్మాణం జరిగి అభివృద్ధిగాంచుతుంటే చూచి ఆనందిచేవాళ్ళల్లో మేమెకరం; అలాకాకుండా సంకుచిత తత్వాలతోటి తయారయే సంఘాన్ని మేము ప్రోత్సహించజాలము.

శ్రీమతి లక్ష్మికాంతమ్మగారు విద్వత్తును, విజ్ఞానాన్ని అపారఅనుభవాన్ని మహిళా ఉద్యమంలో దాని పురోభివృద్ధికి వినియోగిస్తుందనియు, ఆమె కవితా నైపుణ్యం దేశపురోభివృద్ధికి వినియోగపడగలదని ఆశిస్తున్నాము.

## శ్రీ విజయనామ సం॥ర చైత్ర-అధిక వైశాఖమాసములు

| మార్చి నెల 1953 సం॥ | | |
|---|---|---|
| 16 | సో | శు పాడ్యమి 21.37 ఉభా 30-27 ఉగాదిపండుగ |
| 17 | మం | వి 12.33 రే 27-6 త్యా 0-27 |
| 18 | బు | త 10.26 అశ్వని 24.24 త్యా 17.6 |
| 19 | గు | చ 5.21 భ 22.28 త్యా 52.28 లక్ష్మీపంచమి |
| 20 | శు | పం 2.0 కృ 21.28 |
| 21 | శ | ష 1.28 రో 21.40 త్యా 1.28 |
| 22 | ఆ | స 1.57 మృ 23.5 త్యా 44.5 |
| 23 | సో | అష్టమి 2.35 ఆర్ద్ర 25.41 త్యా 55.41 శ్రీరామనవమి |
| 24 | మం | న 4.12 పున 29.33 త్యా 49.13 ధర్మదశమి |
| 25 | బు | ద 6.55 పుష్య 34.31 |
| 26 | గు | ఏ 11.33 ఆశ్రే 40.17 త్యా 6.31 గురువార ఏకాదశి |
| 27 | శు | ద్వా 14.53 మఘ 46.33 త్యా 10.17 వామన ద్వాదశి |
| 28 | శ | త్ర 21.22 పూఫ 53.0 త్యా 6.33 అనంగత్రయోదశి |
| 29 | ఆ | చతు 26.40 ఉఫ 59.13 త్యా 11.0 |
| 30 | సో | ○ పౌ 31.0 హ 60 0 త్యా 20.13 చిత్రపూర్ణిమ. |
| 31 | మం | బపా 34.18 హ 5 0 త్యా 25.0 |

| ఏప్రిల్ నెల 1953 సం॥ | | |
|---|---|---|
| 1 | బు | వి 36 56 చి 9 38 త్యా 23.38 సర్వముహూర్తం |
| 2 | గు | త 38.25 స్వా 13.15 త్యా 27.15 |
| 3 | శు | చ 39.6 విశా 15 33 త్యా 25.13 |
| 4 | శ | పం 37.50 అనూ 16.46 త్యా 30.46 |
| 5 | ఆ | ష 36.46 జ్యే 16.37 |
| 6 | సో | స 33.34 మూల 15.4 త్యా 12.37 |
| 7 | మం | అష్టమి 30.35 పూషా 13.22 త్యా 33.22 |
| 8 | బు | న 25.51 ఉషా 10 27 త్యా 20 27 ప్రయాణవర్జితం |
| 9 | గు | ద 20.41 శ్ర 6.59 త్యా 16.59 వివాహాది సర్వ ముహూర్తం |
| 10 | శు | ఏ 15.13 ధని 3.8, శత 59.4 త్యా 21.8 |
| 11 | శ | ద్వా 9.6 పూభా 55.1 త్యా 15.4 |
| 12 | ఆ | త్ర 3.5, చతు 57.25 ఉభా 51.9 త్యా 19.1 మాసశివరాత్రి |
| 13 | సో | ● అమా 51.7 రే 47.42 త్యా 21.9 |

### అధిక వైశాఖమాసము

| 14 | మం | శుపా 44.59 అశ్వ 44.45 త్యా 37.42 |
|---|---|---|
| 15 | బు | వి 40.30 భ 42.39 త్యా 8.45 చంద్రదర్శనం |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.




డిస్ట్రిబ్యూటర్లు:—ఆంధ్ర : అజంతాఫిలిమ్సు - విజయవాడ; సీడెడ్ : వసంతపిక్చర్సు - గుంటకల్.
నైజాం : సుందర్ పిక్చర్సు సర్క్యూట్ - సికింద్రాబాదు; మైసూర్ : విజయాటాకీస్ డిస్ట్రిబ్యూటర్సు - బె
ఇతర వివరాలకు:—అజంతాపిక్చర్సు—మద్రాసు-20.

Lodhra Press, Madras-14.